వేంకటరాయకవి, బాలాంత్రపు

యాచశూరేంద్రవిజయము అను

శ్రీరంగరాయ పట్టాభిషేకము

పిఠాపురము, 1910

Record no. 250

Vēṅkaṭarāyakavi, Bālāntrapu

Yācaśūrēndravijayamu anu
Śrīraṅgarāya paṭṭābhiṣēkamu

Piṭhāpuramu, 1910

Record no. 250

## Bibliographic Record Target

వేంకటరాయకవి, బాలాంత్రపు.

యాచశూరేంద్రవిజయము అను శ్రీరంగరాయ పట్టాభిషేకము / ఇది బాలాంత్రపు వేంకటరాయకవిచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- పిఠాపురము : శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాశాల, 1910.

3, 2, 6, 122 p. ;20 cm.

Record no. 250

Vēṅkaṭarāyakavi, Bālāntrapu.

Yācaśūrēndravijayamu anu Śrīraṅgarāya paṭṭābhiṣēkamu / idi Bālāntrapu Vēṅkaṭarāyakavicē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Piṭhāpuramu : Śrīvidvajjanamanōrañjanīmudrāśāla, 1910.

3, 2, 6, 122 p. ;20 cm.

Record no. 250

శ్రీరామచంద్ర.

# శ్రీ యాచశూరేంద్ర విజయము.

అను

## (శ్రీ రంగరాయ పట్టాభిషేకము.)

ఇది

బాలాంత్రపు వేంకటరాయకవిచే

రచియింపఁబడి

శ్రీశ్రీరాజా వెలుగోటి రాజగోపాలకృష్ణ
యాచేంద్రబహాదర్ కె. సి. ఐ. ఇ. వేంకట
గిరిరాజావారి ద్రవ్యసహాయముచే

---

పిఠాపురము
శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలలో
ముద్రింపఁబడి
గ్రంథకర్తచే బ్రకటింపఁబడియె.

1910.

మొదటికూర్పు.



    [వెల రు 0-10-0.



# పీఠిక.

ఈనాటకకథ శ్రీశ్రీశ్రీ వేంకటగిరిరాజావారివంశావళినుండి గై
కొనఁబడినది. ప్రస్తుత వేంకటగిరిప్రభువులును, భాషాయోషాపోషకు
లును, ఆంధ్రగీర్వాణభాషాపాండితీవిలసితులును, అగు శ్రీశ్రీ రాజా
వెలుగోటిరాజగోపాలకృష్ణయాచేంద్రబహదరు కె. సి. ఐ. ఇ. వారు
విశేషధనవ్యయము చేసి పండితసంపాదకులవలన శాసనాదులనుండి
చరిత్రవిషయంబుల శేఖరింపఁ జేసి యావంశావళి నిప్పుడు ముద్రింపిం
చుచున్నారు. ఈనాటకము వ్రాయుటలో మ.రా.శ్రీ చిలుకూరి వీర
భద్రరావుగారి జీర్ణకర్ణాటరాజ్యచరిత్రమును, మ. రా. శ్రీ కందుకూరి
వీరేశలింగముపంతులవారి «కవిచరిత్రమును» గూడ నాధారములైన
వి. ఈనాటకప్రథమాంకమున వర్ణింపఁబడిన (స్వర్ణ) బంగారు సింహా
సనమును, ఖడ్గమును, అఱచేతి వెడల్పు గలపచ్చయు నేఁటివఱకు
శ్రీవేంకటగిరిసంస్థానమున నున్నవి. ఈగ్రంథము ఆ 1909 సంవత్సరము
ఆగస్టు 14 వ తేదిని ప్రారంభింపఁబడి ఆ 1909 సం॥రము అక్టోబరు 11 వ
తేదినాఁటికి నిర్విఘ్నపరిసమాప్తి గావింపఁబడియెను. ఇందలికథానాయ
కుఁడగుయాచశూరుఁడు వేంకటగిరిరాజ్యపునరుద్ధరణకర్తయు, బొబ్బి
లిరాజ్యసంపాదకుఁడు నై యున్నాఁడు. శ్రీశ్రీ వేంకటగిరిరాజావారు
దీని నాదరించి తాము రాజ్యాంగనిర్వహణకార్యాలోచనాపరు లయ్యు
ను, గొంతసమయ మిచ్చి ఆ 1909 సం॥రము నవంబరు 3 వ తేది మొద
లు 22 తేదివఱకు గ్రంథమును దమసమ్ముఖమున సాంతముగఁ జిత్తగిం
చి యానందించి గ్రంథముద్రణమునకు వలయుముద్రాభృతి నొసంగుట
యే కాక బహుమానపూర్వకంబుగ సత్కారాదికంబు లొనర్చి సర్వ

జ్ఞసింగభూపాలునికాలమునుండియు వచ్చుచున్నతమభాషాపోషకబిరుదమును సార్థక పఱచిరి. ఇట్టినత్కార్యప్రోత్సాహకు లగు శ్రీశ్రీరాజా వెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్రబహాదరు కె. సి. ఐ. ఇ. వారిని బరమేశ్వరుం డాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి నొసంగి నిరంతరముఁ గాపాడుఁ గాక !

శ్రీశ్రీరాజాబహాదరువారి ప్రథమదర్శనసమయంబున రచియించి యర్పించినయాశీర్వచనపద్యత్రితయ మీక్రిందఁ బొందుపఱుపఁ బడినది:

సీ. శ్రీమానినీనినే ◆ శితకటాక్షవిలోల
నయనారవిందుఁ డా ◆ నందమూర్తి
శత్రువిభేదన ◆ చణసుదర్శనసవ్య
హస్తాంబురుహుఁడు మ ◆ హామహుండు
చతురాగమోన్నీత ◆ చతురాననోద్దీప్త
నాభీసరోజుఁ డ ◆ నంతయశుఁడు
కలుషవిభంగగం ◆ గాజన్మకారణ
పాదపంకేజుండు ◆ పరమపురుషుఁ
డాదినారాయణుండు దే ◆ వాదిదేవుఁ
డాయురారోగ్యపుత్త్రపౌ ◆ త్త్రాభివృద్ధి,
వైభవసమృద్ధి నొసఁగి కా ◆ పాడు మిమ్ముఁ
బ్రీతి శ్రీరాజగోపాల ◆ కృష్ణభూప !

ఉ. లాలితరాజ్యలక్ష్మి జయ ◆ లక్ష్మి విభాసితధైర్యలక్ష్మి వై
మాలము నాశ్రయించి ప్రభు ◆ మంత్రసముత్సవశక్తియుక్తి ని
న్నోలి వరించుఁ గావుత ప్ర ◆ భూత్తమ ! శ్రీ వెలుగోటిరాజగో
పాలకకృష్ణయాచనర ◆ పాలక ! భవ్యకలాకలాపకా !



(సీ.) రా జ గో పా ల కృ ష్ణ యా చ భూ ప

ణియై సతతంబు ◆ వాణి యేనిముఖాంబు
ముల నివాసంబు ◆ సలుపుచుండు
విందు నాభిరా ◆ జీవంబునకుఁ జన్మి
పఁడై యెవ్వాఁడు ◆ ప్రబలుచుండు
లితమూర్తుల వేద ◆ ములునాల్గు నెవ్వాని
డ నమేయప్రభ ◆ నడరుచుండు
తకృత్యుఁడై యేని ◆ నుతుఁడు హేకృష్ణకృ
యటంచు శ్రీహరి ◆ స్మరణసేయు
వదబ్జజాండవిధాత ◆ యేవిభుండు
తురుఁడాసృష్టికర్తసం ◆ తతమునీతఁ
రికృపనాయురారోగ్య ◆ ములనొసంగి
రమకరుణనునిన్నుఁగా ◆ పాడుఁగాత !

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





## ఈనాటకమునవచ్చుపాత్రములు.

1 వేంకటపతిరాజు—చంద్రగిరిమహారాజు.

1,5 చిక్కరాజు—వేంకటపతిరాజునకుసోదరపుత్త్రుఁడు.

7 కుమారచిక్కరాజు—వేంకటపతిరాజునకు కృత్రిమపుత్త్రుఁడు.

1,4,6,7 యాచశూరుఁడు—వేంకటగిరిరాజు, వేంకటపతిరాజు సామంతుఁడు.

6 రాయభూపాలుఁడు—యాచశూరునిపెదతాతమనుమఁడు, మధురాంతకప్రభువు.

1,2,6 జగ్గరాజు—వేంకటపతిరాజుమామగారు. సామంతరాజు. దండనాయకుఁడు.

గోపాలుఁడు, మాధవుఁడు — వేంకటగిరిరాజుసేవకులు.

1,3,6,7 వినయంధరుఁడు—వృద్ధకంచుకి.

2 మేచరాయలు, 2 తిమ్మనాయకుఁడు — దండనాయకులు

1 పెమ్మసానితిమ్మరాజు—మంత్రి.

3,7 వేంకటదాసు—వినయంధరునిమిత్త్రుఁడు, కంచుకి.

బలిగాఁడు—రజకునిబావ.

రజకుఁడు—కారాగృహపరిచారకుఁడు.

7 శ్రీరంగరాయలు—యాచశూరునిచేరక్షింపఁబడినరాజు, చిక్కరాయనిరెండవకుమారుఁడు.

3 వీరనారాయణుఁడు—కారాగృహపతియగుదండనాయకుఁడు.

3 కృష్ణదాసు—యాచశూరునిచేపంపఁబడినదూత.

విష్ణుశర్మ—కుమారచిక్కనిగురువు.
రామశర్మ—విష్ణుశర్మశిష్యుఁడు.
5 తిర్మలరాయలు—చిక్కరాయనిపెద్దకుమారుఁడు.
5 రామరాయలు— ,, కడపటికుమారుఁడు.
6,7 తిమ్మరాజు—వేంకటపతిరాజు మేనత్తకుమారుఁడు, కొండవీటి రాజు.
5 ఓబలరాయఁడు—జగ్గరాజుకొడుకు, కారాగృహపతి.
7 యజ్ఞశర్మ—పురోహితుఁడు.
4 కొండనాయకుఁడు—యాచశూరునిచారుఁడు.

ఇంకను సేవకుఁడు దౌవారికులు మొదలగువారు వత్తురు.

స్త్రీలు.

5 రాణి—చిక్కరాయనిదేవి.
5 వీరాంబ—తిర్మలరాయనిదేవి, చిక్కరాయనికోడలు.
5 కనకాంబ—చిక్కరాయనిచిన్నికూఁతురు.
3 పేరంటాలు—చాకెత.

శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## ప్రథమాంకము.

### నాంది.

ఒకవిలుకానియస్త్రమున హీ ♦ నోన్నతిఁ గూలఁగ నున్న పాండురా
జకులము నైజతేజమున ♦ సాఁకఁగ వేళ యెఱింగి యొక్కయ
ర్భకుని దయామతిన్ మనిచి ♦ ప్రాజ్యరమావిభుఁ జేసి బాసఁ దీ
ర్చికొనినశౌరి వేంకటగి ♦ రిప్రభుఁ డోముత లోకజాలమున్.

( నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి )

( పుష్పాంజలింజల్లి )

సూత్ర—అహో! ఏమి మాభాగ్యము! నిరంతరగురుకవిజనపరివేష్టిత సభాభవనసందీప్తరత్నసింహాసనవిరాజమానుండును, సురూపజయంతకుమారసంసేవ్యమానుండును, వజ్రికిరీటప్రభాభాసమానుండును, సకలాశ్రితజనావనధురీణచింతామణీకామధేనుండును, విబుధజనజేగీయమానుండును నగు శ్రీశ్రీ వెలుగోటిరాజగోపాలకృష్ణయాచేంద్రరాజదేవేంద్రుండు బేతాళవిజయోత్సవసందర్శనసమ్మోదనిమగ్నమానసుండై నేఁటిరాత్రి వీరరసభరితం బగు

నొక్కయపూర్వనాటకమును బ్రదర్శింపుఁ డని మాకాజ్ఞాపిం
చియున్నాఁడు. ఆంధ్రగీర్వాణభాషాశేషపాండితీవిలసనుం డగు
నిమ్మహామహు నెట్లు మెప్పింపఁగలుగుదునో. నా కేమియుం
దోఁపకున్నది.

(తెరలో)

నా కేమియుం దోఁపకున్నది.

(మఱలఁ దెరలో)

తోఁపకున్న మఱియొకసారి చదువుము. ప్రభుసమ్ముఖమునఁ
బ్రదర్శనలోపము లేవియును రాఁ గూడదు. ఈశ్రీరంగరాయ
పట్టాభిషేకనాటకప్రయోగమున మొట్టమొదటనే వినయంధర
పాత్రము రావలయును.

సూత్ర—(ఆలకించి) ఏమిది! శ్రీరంగరాయపట్టాభిషేక మనుచు
న్నాఁడు! నే నిదివఱకు యాచశూరేంద్రవిజయమును బ్రదర్శిం
ప నిశ్చయించితినే? తెలిసికొందును. ఓయీ! ఇటు రమ్ము.

పారి—(ప్రవేశించి) ప్రదర్శకులయొద్ద పాఠముల నొప్పగించుకొనుచు
న్న నాప్రయత్నమున కంతరాయముగ నన్ను మాటిమాటికి
నిట్లు పిలిచెద వేల?

సూత్ర—నీవు మొట్టమొదట నాటకమునకే యంతరాయముం దెచ్చు
చున్నావు. శ్రీరంగరాయపట్టాభిషేక మెక్కడిది?

పారి—సప్తమాంకము లోనిది.

సూత్ర—ఓహో! యాచశూరేంద్రవిజయమే!

పారి—అది యెవ్వరు రచియించినది?

సూత్ర—శ్రీరంగరాయపట్టాభిషేక మెవ్వరు రచియించిరో యెఱుఁగు
దువా?



పారి—ఆ. ఎఱుఁగుదును. అందలి కడపటి గద్యపద్యమున నిట్లున్నది.

గద్యపద్యము.

శ్రీరామచంద్రపా ♦ దారవిందోరుమ
రందపానోజ్జ్వలేం ♦ దిందిరుండు
బాలాంత్రకులచైత్ర ♦ వనపారిజాతుండు
వాధూలసద్గోత్ర ♦ పావనుండు
సూరమాంబాగర్భ ♦ శుక్తిముక్తామణి
నారసింహామాత్య ♦ నందనుండు
అమలధనాభిరా ♦ మాదినాటకకర్త
బంధురచిత్రప్ర ♦ బంధవక్త
యైనవేంకటరాయాభి ♦ ధానసుకవి
చంద్రికృత మిదియాచశూ ♦ రేంద్రవిజయ
మనెడిశ్రీరంగరాయప ♦ ట్టాభిషేక
నామరససముంచితనవ్య ♦ నాటకంబు.

(అని పెదవి గఱచికొని చిటిక వ్రేయుచు నివ్వెఱ పడుచున్నాఁడు.)

సూత్ర—ఇదియా నీ వివేచనము? వినయంధరపాత్రమునకుఁ బ్రవేశక
ప్రథమవాక్య మగు "నా కేమియుం దోఁపకున్నది." అనునది
మొదలుకొని యొప్పగించుచుండఁగాఁ బ్రదర్శకుని మఱలఁ జదు
వు మనిబోధించుచుండిన నీబుద్ధివిశేషత యింతలో నున్నది.

పారి—బావా! నేనును నీవు చదివినయాకుననే చదివితిని. "శ్రీరంగ
రాయపట్టాభిషేక మెక్కడిది?" అని నీ వడుగ లేదా?

సూత్ర—అవును. నీ వెంతవఱకుఁ జదివితివో యని యట్లంటిని.

పారి—ఈరెండు నొక్కయాకుననే యున్నవి. పోనిమ్ము. ఇట్టిమాటల
కేమి గాని యీనాటకప్రదర్శనమున మన మెంతవఱకుఁ గృ

తార్థుల మగుదుమో?

సూత్ర—అట్టియధైర్య మక్కఱ లేదు.

మ. ఇతివృత్తంబు కృతీశుఁడై విమలుఁడై ♦ యింపొందుశ్రీతిర్మల
క్షితినాథాగ్రణివంశరాజమణి యా ♦ శ్రీరంగరాయేంద్రు నం
చితచారిత్రము, వేంకటాచలవిభు ♦ శ్రీయాచశూరేంద్రభూ
పతిజైత్రాభ్యుదయాంచితంబు గణియిం ♦ పన్ వర్ణ్యమేయన్నిఁటన్.

చరిత్రమా వేంకటగిరిసంస్థాపకుఁ డగుయాచశూరేంద్రునివిజ
యము. ద్రష్టయా వేంకటగిరిసంస్థానప్రభుండును, అభినవభోజ
రాజేంద్రుండును నగు శ్రీశ్రీవెలుగోటిరాజగోపాలకృష్ణయాచేం
ద్రుఁడు. కవియా వేంకటరాయకవి. ఇఁకఁ జెప్పవలసిన దేమి?

పారి—నిశ్చయమే. మనము కృతార్థుల మగుదుము. బావా! నీవు
చెప్పినవన్నియును సమంజసముగనే యున్నవి కాని "సదాశ్ర
యేణశోభంతే వనితా కవితాలతా" అను నట్లు కవి మా
త్రము—

సూత్ర—శబ్దసామ్యముతోఁబా టిపుడు ప్రభుసామీప్యముననే యు
న్నాఁడు.

పారి—ఆహా! సంతోషము పట్టఁజాల కున్నాను. ప్రభువువారు స్వ
యముగ మనల నీకార్యమున నియోగించుటచే నిశ్చయముగ
మనము కృతార్థులమే యైతిమి. ఇట్టిసంతోషమున మునిఁగి
నాభూమికలోనిభాగమును నే నెక్కడ మఱతునో యని సం
కోచించుచున్నాఁడను.

సూత్ర—అవును. నీ వట్టివాఁడవే. తుదకు రసాభాసము చేసెదవే
మో! ఏది నీరామశర్మభూమికలోనిభాగమును జదువుము?

పారి—అంతయునా?



సూత్ర—ఆ.

పారి—సరే. బాగుగనే యున్నది.. భామవేషమును వేయించుటకు సి
ద్ధముగ నుంచినబోగముతొత్తును సభలోనికిఁ దెచ్చి కేశసం
స్కారము చేయించినట్లు నాతప్పులను సంస్కరింపఁజూచుట
యీరంగస్థలముననా?

సూత్ర—నీ కున్నది యొక్క పద్యము. నాకుఁ దెలియదా యేమి?

పారి—ఔను. అది శరదృతువర్ణన మిప్పు డేల

సూత్ర—ఇది శరదృతువే. కానిమ్ము.

పారి—అట్లయిన వినుము.

సీ. పోటరుల్ శత్రులఁ ♦ బొడిచి యెత్తినబల్లె
ములఁబోలెఁ గదళికల్ ♦ మొగ్గఁ దొడిగెఁ
బటుశక్తిఁ జూపి లోఁ ♦ బడినవీరులరీతిఁ
జెలరేఁగి వరిచేలు ♦ తలలు వంచె
గెలుపుఁ గైకొన్నయో ♦ ధులకీర్తిలత దెస
తెల్లఁ బ్రాఁకిన యట్లు ♦ రెల్లు పూచె
సత్పాలనముక్రింది ♦ జనులమానసముల
కరణి నద్యంబువుల్ ♦ కలఁకఁ దేఱె

గీ. నౌర! యీచారుశరదాగ ♦ మావసరమె
చటులసంగ్రామకరణావ ♦ సరముఁ దెలుప
విపులబలపరాక్రమయశో ♦ విభవులైన
భూవరులకుఁ బౌరుషములు ♦ పుట్టకున్నె?

సూత్ర—ఓయీ! తూచాతప్పకుండ నున్నది యున్నట్లుగా నొప్పించి
తివి! కాని,

గీ. కాలవైఖరిఁ గని యుబ్బఁ ♦ గాదు ముందు

వచ్చుకాలమునకు నెంత ♦ వడఁక నగునొ?
ప్రభుఁడు ధర్మాత్ముఁ డని పొంగి ♦ పడఁగ నగునె?
వెనుక వచ్చెడువానికి ♦ వెఱవ వలదె?

(తెరలో)

నా కేమియుం దోఁపకున్నది.

సూత్ర—అదిగో! నీతమ్ముఁడు వినయంధరభూమికం దాల్చి వచ్చుచున్నాఁడు. ఇఁక మన మిచ్చట నిలువ రాదు.

(అని యిరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## ప్రథమాంకము.

(కంచుకి యగువినయంధరుఁడు ప్రవేశించును.)

విన—నా కేమియుం దోఁప కున్నది.

గీ. అంతిపురమున జరగువృ ♦ త్తాంతములను
విని చెవిటి కని గ్రుడ్డిగాఁ ♦ జనఁగవలయుఁ
గాని యెంతెంత ప్రాణసం ♦ కటములైన
నెందు నేమరియైన నో ♦ రెత్తరాదు.

ఏలొకో మామహారాజు తనయవసానదశయందు దేవిగారిని, కుమారుని దూరముగా నుంచుచున్నాఁడు? దేవిగారికోలఁది నేఁడెఱింగినదియా? ఇంతవఱకు ననుకూలుఁడుగా నుండి నేఁ డుదాసీనుఁ డైనంతమాత్రమున నేమగును? ఎక్కుడుప్రేమముం జూపి జాతకర్మాదివిధులా చరించి భావుకుం డగునో బలరాయనితనయుం బరిణయంబు గావించి పెంచియున్నకుమారచిక్కరాయని నిష్ప

డేల యుపేక్షింపవలయును ?

క. కాలము చెడ్డది యొకత్రుటి
కాలం బిటు దొరలనేని ◆ కడ కీరాజ్య
శ్రీలలన యెట్టిపాటుల
పాలగునో ప్రజల కేమి ◆ ప్రాప్తించునొకో ?

సీ॥ శ్రీకృష్ణరాయధా ◆ త్రీనాథునిపుణ్యవ
త్త్యో భాగమునునుండి ◆ చొక్కి చొక్కి
రామరాయలభుజా ◆ ర్గళపరిరక్షణం
బును గాంచి క్షేమంబుఁ ◆ బొంది పొంది
తిరుమలదేవరా ◆ ద్దివ్యప్రసాదంబుఁ
గని నిశ్చలత్వంబుఁ ◆ గాంచి కాంచి
కడకు మాపీవేం ◆ కటపతిరాయలఁ
జేరి సౌభాగ్యంబుఁ ◆ జెంది చెంది
విభవమున, విగ్రహంబున, ◆ విలసనమున,
నుదుటుఁదనమునఁ దన కెందు ◆ నెదురులేక
వరలునీరాజ్యలక్ష్మి దై ◆ వంబు చెడ్డ
వైదికునిచేతివిడెముగా ◆ వలసె నకట !.

దేవిగారియ డలి మోమాటముచే రాజుగారెంత యంగీకార భావముతో నున్నను, తన ప్రయత్నము దేవరహస్యముగా నుండవలయునని దేవిగారెంత యడఁచిపెట్టినను, స్త్రీమంత్రముగాన నీవార్త యానోట నానోటఁబడి లోకమంతటను వ్యాపించినదియై యగుటచే నిప్పుడు దండనాయకులయందు గుజగుజలు కూడఁబుట్టుచున్నవి. ఔను. ఇది పుట్టరానిసమయమా ?



గీ. దేవి యభిలాషచే నెంత ◆ తెచ్చికొనినఁ
బేదవైదికబాలుండు ◆ విభుఁడు గాఁగ
నెఱిఁగి యెఱిఁగి ప్రజల్ సహి ◆ యింపఁగలరె ?
జగము మెచ్చునిపను లేల ? ◆ నగవు లేల ?॥

పరేంగితజ్ఞానధౌరేయుం డగు మహారాజుగారిప్పు డిట్లుపేక్షించుటయే యుక్తము. కుమారచిక్కని మొదఁ దనకుఁ బుత్త్రీభావ మున్నట్లు నటించుటచేఁ బ్రజలకుఁగూడ రాజకుమారుఁ డను భావము స్థిరపడి యాతనియం దభిమానము కలుగు ననుభీతిచే వాహ్యాళులందుఁ దనతోడ వెలుపలికిఁ దెచ్చుట లేదు. కాన సోదరసూనుం డగుచిక్కరాయనికే తనయవసానదశయందు రాజ్య మీఁదలఁచి యుండును. కాని ప్రధానదండనాయకుండును, కుమారపక్షపాతియు నగుజగ్గరాయఁ డిందుల కొడంబడఁడు.

ఆ.వె. కనినఁ బెంచికొనినఁ ◆ దనయకుఁ దనయుఁడు
తనయునకును నల్లుఁ ◆ దనము వాఁడు
నగుకుమారునకు న ◆ నర్థంబు కలుగుచో
జగ్గరాయఁ డెట్లు ◆ సమ్మతించు ?

ఇది కారణంబుగాఁ బ్రబలసంక్షోభము పుట్టక మానదు.

చ. తిరుమలదేవరాయజగ ◆ తీవరుకాలమునుండి యొక్కమా
దిరిగ దినంబులం గడపి ◆ తిక్ ప్రభుసేవన మాచరించుచుఁన్ ;
జరగునె యెల్లకాల మొక ◆ చాడ్పున ? నాముదిముప్పున న్మనం
బెరియఁగ నెట్టినీచు నతి ◆ హీనవుఁగొల్వొనరింపఁ గల్గునో ?

(తెరలో)

ఆర్యా ! వినయంధరా ! కుమారసహితుం డగుమహారాజుగారు

మీ రాకకై యెదురు చూచుచున్నారు. త్వరపడుఁడు. త్వర పడుఁడు.

విన—(ఆలకించి) ఏమీ! మహారాజు కుమారసహితుఁడై యున్నాఁడా?—అయ్యో! చిక్కరాయలు విచ్చేసెనా?

(తెరలో)

వచ్చుటయే కాదు. పట్టాభిషేకమహోత్సవసన్నాహముఁ కూడ జరగుచున్నది.

విన—ఏమీ! ఇరువురును చిక్కరాయలే. కుమారచిక్కరాయలు కాదుగద!

గీ. కడుమెఱుంగునఁ దీర్చిన ♦ గాజురాయి
జాతివజ్రంబు నొక్కొక ♦ చేత నుండె
అవశుఁడై యున్నసొన్నారి ♦ అందు దేనిఁ
బైఁడినగఁ గూర్చునో తోఁచ ♦ పాటు గదిరే.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

(ఇది విష్కంభము)

రంగము—రాజభవనము.

[శయ్యపైఁబరుండినమహారాజును, మంత్రియు, చిక్కరాయలును, కంచుకియు, యాచశూరుఁడు, జగ్గరాయఁడు మొదలగు దండనాయకులును ప్రవేశించుచున్నారు.]

రాజు—(కంచుకివంక దృష్టి నిగుడించి) వినయంధరా! చిక్కరాయల నిటకుఁ దీసికొని రమ్ము.

జగ్గ—మహారాజా! కుమారచిక్కరాయ లిటకు రాలేదు.

రాజు—అతఁ డెందులకు? (చిక్కరాయనిం జూచి) నాయనా! మద్వంశాంకురమా! ఇటు రమ్ము!



చిక్క—(దీనవదనుఁడై సమీపించుచున్నాఁడు.)

జగ్గ—(తనలో) అయ్యో! కొంప మునిఁగినది! ఏమి మహారాజీతని బిలుచుచున్నాఁడు!

మంత్రి—(తనలో) నే ననుకొన్నట్లే జరుగుచున్నది.

యాచ—(తనలో) ఈమహారాజు తనయవసానదశయందు న్యాయబుద్ధియు నిజవంశౌన్నత్యమును ప్రకటించుట సర్వజనాహ్లాదకరంబుగ నున్నది.

రాజు—(చిక్కరాయని సమీపమునఁ గూర్చుండఁబెట్టుకొని) కుమారా! నాకుఁ జరమకాలము సమీపించినది. భగవదాజ్ఞకై నిరీక్షించుచున్నాఁడను.

ఆ. వె. తండ్రికంటె నిష్ట ♦ దైవంబుకంటెను
నన్ను గౌరవించు ♦ చున్ననీవు
నాకుఁ బ్రియము గాఁగ ♦ నావెనుక నీరాజ్య
మును గ్రహించి ప్రజల ♦ మనుపు మయ్య!

(అని రాజముద్రిక నీయఁ బోవుచున్నాఁడు)

చిక్క—(కన్నీటితోఁ బాదములపైఁ బడి)

ఆ. వె. తండ్రి నాకరిష్ట ♦ దాయకం బది యేల
వలదు వలదు తగిన ♦ వాని కిమ్ము
పిన్ననాఁటనుండిఁ ♦ బెంచినమీయాజ్ఞ
మీఱుచుంటి నను క్ష ♦ మింపు మయ్య!

రాజు—(కన్నీరు దుడుచుచు) కుమారా! విచారింపకుము.

గీ. నీజనకునసంతరమున ♦ నీవు పొయఁ
దగినరాజ్యంబు నాతలఁ ♦ దాల్చి యుంటి

నీవు నావెన్కనైనను ♦ నెత్తిఁ బెట్టి
కొనవలదె? యర్థు లెవ్వరిం ♦ కను గుమార!

జగ్గ—(తనలో) ఈచిక్కరాయనియమాయకత్వమునకు మూర్ఖపుఁబట్టుకూడఁ దోడైనచో మాకుమారచిక్కనియదృష్టము ఫలించును.

విన—(తనలో) శ్రీరంగరాయతనయుఁడ వగునీ కీవినయసౌశీల్యములు తగునోయి!

యాచ—కుమారచంద్రా! వంశరత్నమా! యువరాజ వగునీ కెప్పటికైన నిది తప్పనిసే కదా! రాజాజ్ఞ శిరసావహింపుము.

జగ్గ—(కోపముతో) యాచశూరా! నీకిప్పు డిట్టిపెత్తన మెవ్వరొసంగిరి? ఈచిక్కరాయనితిక్క విడిపింపుమని నిన్నెవరైన కోరి వేఁడుకొనిరా? ఊరక లేనిపోని కార్యములకుం బూనుకొనెద వేల?

యాచ—నీవటె నే నకార్యకరణంబునకుం బూనుకొన లేదు. తగినవాఁడు గనుక నే నట్లు చెప్పితిని. నీ కీకంఠశోష యేల?

జగ్గ—తగినవాఁడు తగినవాఁ డనియెదవు! ఎందుకుఁ దగును?

గీ. ప్రబలభీకర కేల ఘో ♦ రరణవార్త
మందునకు నేల కాంతాప్తి ♦ సంగకలన
కుడిచి కూర్చుండఁగా నేర్చి ♦ కొనినయట్టి
చిక్కరాయని కీయభి ♦ షేక మేల?

వలదని యాతఁడే చెప్పుకొనుచుండెను గాదా!

యాచ—అది వినయోక్తి. నీచునకు గౌరవ మిచ్చినను నిలువదు గాని ఘనునకు వలదనినను తనంతఁ దానే వచ్చుచుండును.



గీ. ఉత్తమక్షత్రియుండు ధీ ♦ రోద్ధతుండు
ప్రథితశ్రీరంగరాయపు ♦ త్రకుఁడు వీర
వేంకటక్ష్మావిభుని పేర్మి ♦ వెలసినాఁడు
చిక్కరాయఁ డీరాజ్యంబు ♦ చేయఁ దగఁడె?

జగ్గ—(క్రోధముతో) అది యెట్లు పొసంగును? ఔరసుఁ డుండఁగా నీతని కీరాజ్య మెట్లు వచ్చును? ఏమి నీధర్మవేత్తృత్వము!

యాచ—ఓధర్మస్వరూపా! న్యాయమూర్తి! త్వరపడక యిటు వినుము.

ఆ. వె. ఔరసుండు గాని ♦ యాతండు కాకపో
నీయ దేల మనకు? ♦ నీయఖండ
రాజ్యలక్ష్మి మొదల ♦ రాజిల్లె నెవ్వని
సొత్తు గాఁగ నదియ ♦ చూచికొనుము.

శ్రీరంగరాయభుజాబలపరిరక్షణమున విలసిల్లిన యీరాజ్యలక్ష్మి యాతనికుమారునికిఁగాక యన్యు నెట్లు చేరును?

జగ్గ—అది యప్పుడే పోయినది. ఎవనిదాక్షిణ్యంబున నీరాజ్యలక్ష్మి యింతదనుక లాలింపఁబడుచున్నదో ఆతనిసంతతికే చెందవలయును. ఔరసుం డగుకుమారచిక్కనికీరాజ్యంబు పొంద నర్హమగుంగాని యాతం డెవఁడు?

యాచ—కుమారచిక్కరాయ లెవ్వనియౌరసుఁడు?

జగ్గ—ఏమి! మదాతిశయంబున మర్యాద నతిక్రమించి పలుకుచున్నావు?

యాచ—బాగుగఁ దెలిసియే మహారాజునెదుట వాస్తవము వక్కాణించుచున్నాను.

జగ్గ—ఇట్టి తలంపు నీకే కలిగినదా?

యాచ—లోకమున కంతకును—

జగ్గ — ఏమేమీ !

చ. మదమునఁ గన్నుఁ గాన కిటు ♦ మాటికిఁ బ్రేలెద వేర ! రాజు ని
న్నదిరి వచింపకుండెనని ♦ యే గద ! దుర్మతి ! రాణివాసపు
న్మదిశల కిట్టినింద తల ♦ మోపిననీదగు నాల్కఁ బట్టి యీ
ప్రదరముతోడ నింతలుగ ♦ బల్విడిఁ గోసినఁ బాప మాఱునే !

యాచ — ఓరి మూర్ఖుఁడా ! ఇట్టి యపార్థము లేల చేసి కొందువు ? మ
హారాజసన్నిధానం బగుటచే నిన్ను మన్నింపవలసెఁ గాని
లేకున్న,

క. నానాలుకఁ గోసెద నని
వోనాడిననీశిరంబు ♦ నూఱుతునియలై
యీనేలఁ బడఁగ నన్నిశి
తానూనఖరాసి యఱుమ ♦ దా ! నిముసమునన్.

మానధనుం డగుమహారాజు నీమరియాద నింతవఱకు నిలిపినం
దులకు సంతసింపుము. అనరాదు గాని

చ. ఒకకులహీనుఁ దెచ్చి సుక ♦ లోదితుఁ డౌనని యెంతచేసినన్
సకల మెఱింగె లోకము ని ♦ జమ్మని చచ్చినయట్టులుండ కూ
రక మనుమండటం చెగసి ♦ రాలుచుచుండిన మానహీనుఁ డు
త్రికులకళంకు నిన్నుఁ దలఁ ♦ దన్నుటకైనను సంశయించెదన్.

జగ్గ — వ్యర్థవాగాడంబరా ! నీపౌరుషమును మాటలచేతనే వెల్లడించు
కొనుచున్నావు !

యాచ — కావుననే నిలిచి వదరుచున్నావు.

జగ్గ — నీ వేమి చేయఁగలవు.

యాచ — కులదూషకులకుం దగినశాస్తి.

జగ్గ — సార్వభౌమత్వము నీవే వహించిన ట్లున్నది !



యాచ — అది యన్యులపాలు గాకుండ రక్షించుటకు.

జగ్గ — రక్షించుటకు నీ వెవ్వఁడవు ?

యాచ — ఎవ్వఁడనా ?

మ. అరిరాజన్యవరోత్తమాంగదళనో ♦ ద్యచ్చంద్రహాసప్రభా
కర తేజస్సహమాన వైరిబలదు ♦ ర్గర్వాపనోదక్రియా
చరణారంభలసన్నిరర్గళభుజా ♦ సంరంభ వేతాళభూ
వరవంశప్రభవాభిరాముఁడఁ దలం ♦ పన్ యాచశూరేంద్రుఁడన్.

మఱియు,

చ. అదనఁ బ్రతాపరుద్రవిభు ♦ నానతిఁ బాండ్యుల నొంచి "పంచపాం
డ్యదళవిఫాల" యన్ బిరుదు ♦ నామముఁ, గాంచనసింహపీఠముం
బదపడి మేలిపచ్చతల ♦ మానికముం గొనె ఱేనిచేత నే
సదములుఁ డట్టెదాచనృపు ♦ సత్కులసంభవు నన్నెఱుంగవే ?

జగ్గ — ఆహా ! ఏమి మీయాత్మస్తుతిపరాయణత ! పొగడికొనుము మ
ఱియుం బొగడికొనుము. నిన్నన నేల ? ముప్పుగాలమున మతి
దప్పి యూరక చూచుచున్నయీరాజు ననవలయుఁగాక !

యాచ — వీరి వారి నిందింప నేల ? నీ కిట్టి దుర్బుద్ధి నొసంగినదేవుని నిం
దింపుము. వెనుక ముందరయని సాహసిక లగురాణివాసముల
నిందింపుము ! రెంటికిం జెడినరేవణి యైనకుమారచిక్కనిదుర
దృష్టమును నిందింపుము. అంతకుం దీఱనియెడల నిన్నే నిందిం
చుకొనుము.

జగ్గ — ఏమీ ! యీసాహసము ! రాజకుటుంబమున నంతఃకలహములఁ
గల్గించి తుద కీరాజ్యమును నీవే యపహరింపఁ దలంచుచున్న
ట్లున్నావు ! ఈజగ్గరాయనిబొందిలోఁ బ్రాణమున్నంతవఱ కట్లు
జరుగదని రూఢిగ నమ్ముము.

యాచ—నీహృదయమందలియుద్దేశములను నేర్పుచేఁ బెరవారియం
దాఁగోపించుచున్నావు! నే నట్టివాఁడను గాను.

ఉ. తూలి చనంగ శత్రువుల ♦ దోర్బలమొప్ప జయించి యాజిలోఁ
నేలిక కాకతీయగణ ♦ పేంద్రుని మెచ్చ్చన లక్షసీమయుఁ గ్రా
మేలితురాయి పైడిపస ♦ మించుకృపాణముఁ గొన్నయట్టి బే
తాలనృపాలుసంతతికిఁ ♦ దాఁకునె లోభగుణంబు దుర్మతీ!

సీ. కాకతిరాజ్యర ♦ క్షణఁ జేసిమాప్రసా
దాదిత్యపతి బిరు ♦ దందినాఁడు
తిరుకాళరాజరా ♦ జ్యరమఁ గాపాడిమా
దాచనాయఁడు పేరు ♦ మోచినాఁడు
మలకలఁ జెండి కో ♦ ల్మచెలమ మన్నీల
నిలిపి మాయాచఁడు ♦ నెగడినాఁడు
గండికోటకును బు ♦ క్కనిరాజుఁ జేసి మా
సింగభూపతి కీర్తిఁ ♦ జెందినాఁడు
అట్టి బిరుదులవంశమం ♦ దవతరించి
ఇంత ముక్కనమాపిరు ♦ న్నంతివఱకు
వంచకుల నొంచి పరులపా ♦ ల్వడక యుండ
మనుతుఁ గాని రాజ్యము హరిం ♦ తునె దురాత్మ!

ఇఁక నూరక వదరకుము

జగ్గ—నీకుచ్చితపుసంకల్పములన్నియును మాటలనే వెల్లడి యగుచున్న
వి. ఇఁకఁ బ్రేలకుము!

రాజు—(తనలో) వీర లతిప్రసంగమునకుఁ జొచ్చుచున్నారు! దేవిదు
ష్కార్యమును నాయుపేక్షయు నింతకుం దెచ్చుచున్నవి. (ప్ర
కాశముగ) మామా! ఆవశ్యకకార్యమున కభ్యంతరముగ నీ



యవాంతరప్రసంగ మేల?

జగ్గ—(కోపముతో) నీయిష్టమునకు నాయభ్యంతర మేమున్నది? నిం
డుసభలో నొక్కనీచుఁడు రాణివాసముంగూర్చి దుర్భాషలా
డుచుండ మానవమాత్రుం డెవ్వఁడు సహించి యుండఁగలఁడు?
సర్వతంత్రస్వతంత్రుఁడ వగునీ వొనరించెడుకార్య మిప్పటి కె
ట్లును జరుగక తప్పదు! మతి చెడి కన్నకుమారుని విడిచి య
న్నకుమారునకు రాజ్య మిచ్చుచున్ననీకు నాప్రసంగము రుచి
యించునా? నీయిష్టమునకు వ్యతిరేకముగా నిచ్చటనుండి ప్ర
సంగించుటకంటె నే నావలకుం బోవుటయే మేలు. అక్రమమై
న యీ యోగివలన గృహీత కెట్టిమేలు గలుగునో చూచెదఁ
గాక! (అని చివాలున లేచి పోవుచున్నాఁడు.)

మంత్రి—(తనలో) ఓహో! కలహబీజమున కంకురార్పణ మైనది.

ఆ. వె. అకట! జగ్గరాయ ♦ లంతలంతలఁ బోవు
వాఁడు గాఁడు; భూమి ♦ పాలకుండు
విభవ మెల్ల దేవి ♦ యభిమానపుత్త్రిన
కొసఁగఁదలఁపఁ డేమి ♦ పొసఁగునో కద!

రాజు—వినయంధరా! చూచితివా జగ్గరాయనిదుడుకుఁదనము!

యాచ—ప్రభువరా! ఆతనిదుడుకుఁదనము దేవరవారి మెత్తఁదనము
వలననే వచ్చినది గాని వేఱు కాదు.

రాజు—నిజ మాడితివి.

చిక్క—(అంజలిపట్టి) తండ్రీ!

ఆ. వె. ధరణి నాకు నమ్మ ♦ తము గానియీరాజ్య
పట్ట మేటికి? కకట! ♦ పార్థివేంద్ర!
కడకు నీకు ముప్పు ♦ గాలంబునను బిడ్డ

విడిచి చనెడివాడు ♦ వాడమ నేల ?

రాజు—కుమారా ! అట్లు కాదు.

ఆ. వె. నీకుజనకుపదవి ♦ నీ కిచ్చి హాయిగా
నొడలు విడువవలసి ♦ యున్న నాకు
నిజతనూజుఁడేఁ? ♦ నీకంటె నీరాజ్య
పాలనంబు చేయు ♦ వార లెవరు ?

చిక్క—తండ్రీ ! మీయాజ్ఞ నతిక్రమింప సాహసించువాఁడను కాను గాని ఈకారణంబున ముందుముం దెట్టికల్లోలములు పుట్టునో యని శంకించుచున్నాను.

రాజు—అంసులకు సంశయింపకుము. పరాక్రమధనుం డగుయాచశూరుండు నీ కన్నివిధముల బాసటయై యుండఁగలఁడు.

చ. అనవరతు లాతురుష్కవసు ♦ ధాధిపులం దొలింప నేగుచో
నవనిపరాక్రమంబుఁ గని ♦ యేచురియుండుకు సంగరంబునం ;
దెవనినహాయముం గనుట ♦ నేనెదఁ జేయిశి నిద్రవోదు ; నా
ప్రవిమలు యాచశూరు నెడఁ ♦ బాయక యుండుము నీకు మేలగుణ్.

యాచ—(లేచి)

మ. ఇది సంతోషము నొందఁగాల మగుఁగా ♦ దే చిక్కరాజేంద్ర ! నీ
మది సంతాపము నొంద నేల? పరికిం ♦ పన్ సార్వభౌమాజ్ఞ తె
ప్పదు లోకంబును సమ్మతించుఁ జుమి భూ ♦ పాలుండవై మమ్ము నే
ర్పొదవన్ బాలన సేయుఁబూని మను మా ♦ యుష్భోగభాగోన్నతిన్.

అవివేకులప్రల్లదంబుల కనుమానింపకుము. కుమారా ! శ్రీరామరాయలకాలమునుండియును వచ్చుచున్న పితృవాక్యపరిపాలనధర్మమును నిర్వర్తింపుము.

రాజు—నాయనా ! ఇటు రమ్ము. ఈసఖునిపలుకు లాదరింపుము.



చిక్క—తండ్రీ ! నే నీరాజ్యభారమును వహించుట విధివిధానమే యైనయెడల పితాజ్ఞ శిరసావహించుచున్నాఁడను. (అని నమస్కరించును.)

రాజు—(సంతోషముతో రాజముద్రిక నంగుళిం గూర్చి)

చ. అనువుగ నెల్లదిక్పతుల ♦ యంశములు న్నినుఁ జెందుఁ గాక ! నీ
మనము నిరంతరంబు మను ♦ మార్గమునం జనుఁ గాక ! నాదుదీ
వనలు ఫలించుఁ గాక ! బుధ ♦ వందిత రాజ్యరమావధూటి దా
నిను వరియించుఁ గాక ! మఱి ♦ నీకు శుభం బగుఁ గాక పుత్త్రకా !

(అందఱును తథాస్తు అనుచున్నారు.)

చిక్క—(కన్నీరు నించుచున్నాఁడు)

రాజు—ఇట్టి శుభసమయంబునఁ గంటఁ దడి నెట్టకుము.

సీ. ఇరువదితొమ్మిదేం ♦ డ్లీరాజ్యభారంబు
తలఁదాల్చి పాలించి ♦ తనిసినాఁడ
వైభవంబున శచీ ♦ వల్లభునింబోలి
సకలసౌఖ్యము లందఁ ♦ జాలినాఁడ
అఖిలసామంతధ ♦ రాధినాయకులసే
వలఁ గాంచి నిరతంబు ♦ నలరినాఁడ
వసుధ నీవలన న ♦ పత్యతాసిద్ధియుఁ
బౌత్త్రలాభంబును ♦ బడసినాఁడ
నరవి నే సహస్ర ♦ చంద్రదర్శనుఁడనై
చేరినాఁడఁ బెద్ద ♦ వారిలోన
నెంతకాల మున్న ♦ నేమగు ? నికనైన
వలదె నాకు స్వర్గ ♦ వాససుఖము ?

కుమారా ! నాకొఱకు విచారింపకుము. ఊఱడిల్లుము !

చిక్క—హా తండ్రీ! ఎట్లూఱడిల్లి యుండఁగలను?

ఉ. కన్నకుమారకుంబలెనె • కన్నుల నొద్దిక నద్దికొంచు నా
పిన్నటనాఁటనుండియును • బెంచితి వింతటివానిఁ జేసి నా
వెన్నుఁడుఁ బాయకుండఁ జరి • యించితి నీకడ నేఁటి కిట్లుగా
న న్నెడఁబాసి పోయెదవె • నాయన! యేమని యూఱడిల్లెదన్?

అయ్యో! తండ్రీ! న న్నెవ్వరి కొప్పగించి పోయెదవు?

రాజు—భుజాబలవినిర్జితవైరివీరుం డగుయాచశూరుండు కంటికి ఱెప్పవలె నిన్నరయుచుండు. నీతాతనాఁటినుండియు మమ్మందఱ నమ్మికతోఁ గొలిచినయీవినయంధరుండు నావలెనే నిన్నరయఁగలఁడు. విచారింపకుము.

వినయ—(దుఃఖముతో) అయ్యో!

గీ. తిరుమలేంద్రుని శ్రీరంగ • ధరణిధవుని
మ్రింగితిని దేవ! నినుఁగూడ • మ్రింగుకొఱకుఁ
దొంబదేఁడులముదుసలి • తొక్కి నయ్యు
బ్రదుకుఁ గంటి నే నెంతని • ర్భాగ్యుఁడ నొకో?

రాజు—వినయంధరా! ఏమి యీవెఱ్ఱి!

ఉ. సర్గము దొట్టి మొదలు ర • సావరు లేగిరి? నేను లెక్కయే
యార్గురు చక్రవర్తులు ప • దార్గురు రాజులు ధాత్రి సుస్థిరా
నర్గళలీల నేలి తుది • నాకము చూఱకొనంగ లేదె? నా
స్వర్గతి కింతయేల వగ • వన్ మృతి సాజము గాదె దేహికిన్?

ఓసామంతభూపాలులారా! దండనాథులారా! ఇటు వినుండు.

సీ. శ్రీరంగరాయధా • త్రీనాథతనయుండు
తిరుమలరాయభూ • వరునిపౌత్త్రుఁ
డతిప్రియుం డైననా • యభిమానపుత్త్రుండు



రాజద్గుణుఁడు ప్రజా • రంజకుఁడు
అనవరతప్రజా • వనశుభశీలుండు
రాజనీతికళావి • రాజితుండు
ధర్మసంరక్షణో • దారధీబలశాలి
వినయాదిసద్గుణ • విస్తృతుండు
నన్ను మఱపించి మి మ్మేల • నున్నవాఁడు
మీమదిఁ గరంచువాఁడు ప్రే • మింపఁ దగిన
వాఁడు నగుచిక్కరాయని • నేఁడు మొదలు
వెన్నుఁబాయక కొలిచి సే • వింప రయ్య!

(అందఱును అంగీకారమును సూచించుచున్నారు.)

రాజు—(చిక్కరాయనిం జూపి) యాచశూరా! నీ వీతని నాకు మాఱుగాఁ జూచుకొనుచుండుము. రాజ్యమున నెట్టికల్లోలములు పుట్టకుండఁ గాపాడుకొనుము. కపటమార్గప్రచారకు లగుదుర్జయుల నరసి శిక్షించుచు నెల్లవిధముల నీచిక్కరాయనికిఁ దోడ్పడి యుండుమని వేఱ చెప్పవలయునా?

యాచ—మహీపాలచూడామణీ! దేవరయానతి శిరసావహించుటకంటె నాకు విధాయకకృత్య మేది?

మ. భవదాజ్ఞాబలసత్సహాయమునఁ దీ • వ్రక్షోభసంపాదిశా
త్రవసందోహవిదారణక్షముఁడనై • రాజ్యంబుఁ దొల్లింటిపా
ర్థివవంశంబున యందె నిల్పి ప్రభుభ • క్తిం జూపి దీపింతు మా
నవలోకంబు నుతింపఁ జంద్రరవిది • జ్ఞాథోత్తముల్ సాక్షిగన్.

రాజు—నాసంపూర్ణాశయ మయ్యెదియే (మంత్రివంకఁ జూచి) తిమ్మరాజా! ఖడ్గకిరీటముల నిటు తెమ్ము.

మంత్రి—(ఇచ్చుచున్నాఁడు)

రాజు—(అంకెకొని చిక్కరాయనిం జేరఁజీరి)

చ. ధరణి భరింపుమయ్య! నృప ♦ ధర్మము నూని చరింపుమయ్య! సో
దరులుగ నీకు లోఁబడిన ♦ ధారుణినాథుల నెంచుమయ్య! యా
దరమునఁ గన్నబిడ్డలవి ♦ ధంబున నీప్రజ నేలుమయ్య! సు
స్థిరతరరాజ్యవైభవముఁ ♦ జెంది సుఖింపఁగదయ్య పుత్త్రకా!

(అని కిరీటమును తలపైనుంచి ఖడ్గము నిచ్చుచున్నాఁడు)

చిక్క—(తండ్రికి నమస్కరించుచున్నాఁడు)

యాచ—(చిక్కరాయనిం జూచి) కుమారా! సార్వభౌముఁడ వగుము.

రాజు—మంత్రీ! ఇఁక నా కవసానకాలము సమీపించినది. దినములలో నున్న నాకు ఈకుమారపట్టాభిషేకమహోత్సవము చూచుటయే తుదిమనోరథము. కావున నాయావిధులఁ ద్వరలో నెఱవేర్పవలయును.

మంత్రి—చిత్తము.

(తెరలో వైతాళికులు)

చ. కువలయము మేలలేమిఁ దన ♦ కుఱ్ఱ ముసిన్వృత్తియె యుంచుఁ గావిశా
లువులు ధరించి పద్మినిస ♦ లోనొకనారి తలంచి రాగిగా
రవము ప్రవృద్ధమాటకుఁ గ ♦ రంబును జింతిలి యెట్టులో తెగక్
దివిచె నిరుం డనంగ దివి ♦ నిండి వెలింగెడి సాంధ్యరాగముల్.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## ద్వితీయాంకము.

(ప్రవేశము—జగ్గరాయలు.)

జగ్గ—(నిట్టూర్పు విడిచి) ఔరా! కాలమహిమ!

సీ. ఒకనిముసంబు బా ♦ యక యుండ నర్థదే
హంబుగా మాబాయ ♦ మాంబ నెంచి
తన్నిఁ గీచి సగీటు ♦ దాఁటక యెల్లప్పు
డనుకూలవర్తియై ♦ యలరుచుండి
క్రిందఁ గాలుంచినఁ ♦ గందు నంచుఁ గుమార
చిక్కరాయుని ముద్దు ♦ జేసి పెంచి
స్వప్నమందైన హా ♦ స్యంబునకైన నా
మాట నించుక జవ ♦ దాఁటకుండి
గీ. అకట! వేంకటపతిరాయఁ ♦ డంతిమదశ
మతి చెడి ప్రియంబు లన్నియు ♦ మంటఁ గలిపి

మమ్ము విడనాడి యన్నకు ♦ మారుఁ డనుచు
నొక్కఁ బెంగలికిని రాజ్య ♦ మొప్పగించె.

మాహృదయంబులఁ జిచ్చు పెట్టి మ మ్మందఱ విడిచి తాను స్వర్గమునకుం బోవుటయే కాక యెదురురొమ్మునఁ గుంపటినలె నీచిక్కరాయని మా కందఱకు రాజుగాఁ జేసి పోయెనే? కులహీను డైన సేవింప నంగీకరింపవచ్చును గాని, బుద్ధిహీనుని, పరాక్రమవిహీనుని, రాజుగాఁ జేసికొని తరించుట పౌరుషవంతులకు దుర్భరము! దుర్భరము!

గీ. అనుఁగుటల్లునిచావు, నం ♦ దనయనాథ
తయును, ముద్దులమనుమని ♦ ధరణిరాజ్య
పట్టభంగంబు మచ్చిచ్చు ♦ పగిది నాదు
హృదయము దహించుచుండ స ♦ హింపఁగలనె?

చీ! చీ! దురాత్మా! చిక్కరాయా! సడమంత్రపుసిరిచే మత్తిల్లి కన్నుఁ గానక యెంత మిడిసిపడుచున్నావు? జగ్గరాయల బొందిలోఁ బ్రాణములున్నంతవఱకు నీరాజ్యము సుస్థిరం బయ్యెనని గర్వింపకుము. (స్మృతి నభినయించి) కుమారచిక్కరాయఁడు వేంకటపతిరాయనియౌరసుఁడు గాఁ డని. దుష్టలోకమునఁ గింవదంతి యొకటి కలిగి నాప్రయత్నములకుఁ గొంతయాతంకములను గలిగించుచున్నది. ఆకారణముననే కదా బంధునాథులెల్లరును గుమారచిక్కని లెక్కింపక యానిర్భాగ్యుఁ డగు చిక్కరాయనినే కొలుచుచున్నారు. ఏది యెట్లున్నను,

గీ. నాతనయ పెంచికొన్నఁ గ ♦ న్నసురేకు
మారచిక్కఁడు రాజగు ♦ మాఱుఁ జో కద!
అతఁడు ప్రక్కినవేన లా ♦ గడఁగి వడఁగి



ప్రబలకవలయునె యొకరుని ♦ పంచఁ జేరి?

పితృకిపందయు, నవివేకియు, నగుచిక్కరాయనిం బదభ్రష్టునిం జేయుట యెంతపాటిపని! కాని, వేంకటగిరిప్రభుం డగుయాచశూరుం డాతనిపై నీఁగ వ్రాలకుండఁ గాపాడుచున్నాఁడు. అతఁడసాధారణప్రజ్ఞాధురీణుండై కన్నుఁగానకుండును. విశేషించి నాకుఁ బరమశత్రుఁడు. అది యెంచియే కదా మంత్రితిమ్మరాజు మూలమున నాతని విశాఖపట్టణప్రాంతములకుఁ బంపునట్లు చేసితిని: కానిమ్ము. ధీపరాక్రమఘనుండ నగునాకు వీ రొక లెక్కయా?

శా. ధీచాతుర్యము మీఱఁ, ధైర్యనిధి వౌ ♦ ద్రేకంబు దైవాఱఁగా
మేచక్ష్మావరతిమ్మనాయకబలా ♦ మేయస్ఫురన్మూర్తినై
నీచుం జిక్కని యాచశూరుఁ జెనఁదక్ ♦ జింతింప బంధించి పూ
ర్వాచారంబును నిల్పి నిల్వఁగ కుమా ♦ రాధీశుఁ జిక్కప్రభున్.

(నేపథ్యమున.)

అవశ్య మట్లు జరుగక తప్పదు. అసమర్థుఁ డగుతన కిసుమంతయైనఁ గొఱంత రాకుండ నతిచతురుఁడై రాజ్యతంత్రముల నిర్వహించుమంత్రినే యుపేక్షించుచున్ననిర్భాగ్యుఁ డగునాతనికీరాజ్యము దక్కునా? అయినది——

జగ్గ——(ఆలకించి) సాధు! మిత్రరత్నములారా! సాధు!

(మేచరాయలును, తిమ్మనాయకుఁడును
ప్రవేశించుచున్నారు.)

జగ్గ——మిత్రులారా! దయచేయుఁడు.

(అందఱును గూర్చుండుదురు.)

జగ్గ—ఏ మైనది?

తిమ్మ—చిక్కరాజురాజ్యమున కంత్యకాలము.

మేచ—కుమారచిక్కరాయనికి సార్వభౌమపదప్రాప్తకాల సామీప్యమును—

తిమ్మ—అది యెంతసేపు.

జగ్గ—(సంతోషముతో) మిత్రమా! ఏ మట్లనుచుంటివి?

తిమ్మ—అనుట కేమున్నది? చిక్కరాయనియవివేకము మనకు మేలుఁ గూర్చుచున్నది.

జగ్గ—ఎట్లు?

తిమ్మ—మంత్రియగుపెమ్మసానితిమ్మరాజును నారప్పరాయలను దన్నుండి వేఱు చేసికొని—

మేచ—మనలోఁ గలిపి యనుము.

జగ్గ—అది యెట్లు పొసంగినది?

తిమ్మ—మొన్నమొన్న రాజ్యమునకు వచ్చెనో లేదో గాని యీయవివేకి దండనాయకులలోఁ గొందఱిని గోటలోఁ గాపుర ముండవలదని యాజ్ఞాపించినసంగతి లోకవిదితమే కదా!

జగ్గ—అవును.

తిమ్మ—పిమ్మట మహారాజుబావమఱఁది యగునారప్పరాయనిం బిలిపించి, పాపము! మహారాజుతో సహగమనము సేయువేళ రాణి యాతని కొసంగినభూషణములఁ దన కిమ్మని బలాత్కరించెనఁట!

జగ్గ—ఎంతయవివేకము. ఏమి యీలుబ్ధాగ్రేసరత్వము? పాపము!

ఉ. ఎన్నఁడు రాజనీతిఁ గన; ♦ కెంతయు శౌర్యము లేక; యత్తరుల్
కొన్ని యలంది మేల్చలువ ♦ కోకలు గట్టి; విడెంబు సేయుచున్
మిన్నక కామినీమణుల ♦ మేడలలోనఁ జరించుచుండి యే



యన్నము, బున్నెముం, దెలియ ♦ నట్టివిమూఢున కా ప్రభుత్వముల్?

మేచ—ప్రపంచవాసన యెఱుఁగనివానికిఁ బ్రభుత్వ మబ్బినఁ బ్రజలకు సుఖము కలుగఁజేయఁగలఁడా? తాను సుఖపడఁగలఁడా?

జగ్గ—అవును. బాంధవ్యమున నేమి, పెద్దతనమున నేమి గౌరవింపఁబడఁదగిననారప్పరాయలనే కేవలతుచ్ఛధనాపేక్షచేఁ దూలనాడెను గదా!

తిమ్మ—అంతతోఁ దీఱినదా? ఆదినముననే మంత్రితిమ్మరాజును రప్పించి "నీవు నాపినతండ్రియొద్ద గుప్తముగాఁ గొంతద్రవ్యమును సంపాదించితి వఁట; దానిం దెచ్చి మాకు సమర్పింపుము; నీ తమ్మునిస్వాధీనమునం దున్నదుర్గములను మాతిరుమలరాయనికి విడిచిపెట్టుము." అని ఖండితముగాఁ బలికెనఁట!

జగ్గ—ఏమి యింతవఱకు వచ్చినదా? ఇతనికి వినాశకాలము సమీపించినది. ఇఁక మనము విశేషప్రయత్నములు చేయ నక్కఱ లేదు. అందునకు వా రేమనిరో?

తిమ్మ—"మూఁడుదినములలో సమాధానము చెప్పెద" మని వారు కొల్వు వెడలి పోయిరఁట!

జగ్గ—(తల పంకించి) ఇదే సమయము. మనప్రయత్నమునకు దైవ మనుకూలించినట్లే యున్నది. వా రేమియాలోచించుచున్నారు?

మేచ—ఆలోచించుట కే మున్నది యీయనిదానికి?

జగ్గ—వా రంతవఱకు సాహసింపఁగలరా?

తిమ్మ—ప్రాణములమీఁదికి వచ్చినప్పు డేమి చేయ నోపరు?

మేచ—వారు మనకు సర్వవిధముల సహాయము చేయ సిద్ధముగ నున్నారు.

తిమ్మ—అవును. ఇప్పుడు వారికిఁ గావలసిన దొకటె; మనకుఁ గావల

సినది వేఱొకటి; చేఁజిక్కినదానిని విడువకుండుట వారికి, ఒక
దానిని జేఁజిక్కించుకొనుట మనకు.

జగ్గ—కావున నిప్పు డుభయులకును బ్రయత్నము సమానమే.

గీ. ఎవనిఁ దలపోయుచుంటిమో ♦ యింతదనుక
మహితుఁ డామంత్రి విడివడి ♦ మనలఁ జేరె
తూము విడి చెఱ్వున జలంబు ♦ త్రోవఁబట్టి
తమపుఁగోరెడిచేలపైఁ ♦ బడినయట్లు.

తిమ్మ—అంతియ కాదు.

గీ. మంత్రి మనలోనఁ జేరిన ♦ మాట వినుట
యనఘ! మనకోర్కె ఫలియించె ♦ ననుట గాదె?
అల్లచినతిమ్మరాజదు ♦ ర్గాధిపతికి
భ్రాంతి యాతం డగుటఁ జాల ♦ భద్ర మయ్యె.

జగ్గ—సంతోషము! సంతోషము!

శా. మన మన్యోన్యసహాయసంపదలఁ గా ♦ న్యాం బంది తేజోవిహీ
నుని, మూఢాత్ముని, దారపుత్త్రియుగ నెం ♦ తో వేడ్క బంధించి, నా
కును మీకుం గలకోర్కె మాఱఁగ నరి ♦ క్షోభంబుఁ గల్పించి యొ
య్యన భూమీశుని జేయవచ్చును గుమా ♦ రాధీశుఁ జిక్కప్రభున్.

మేచ—ఆవిషయమున నయవిశారదు లగుమీయూహామున కేమి పొ
డకట్టెఁది?

తిమ్మ—విభేదనోపాయనిపుణతాప్రసిద్ధధీవిభవుం డగుజగ్గరాయనికి దు
రూహ్యము లగురాజనీతివిశేషము లుండునా?

జగ్గ—ఊహాముల కేమికొదువ?

గీ. పౌరుషంబున కెందు దై ♦ వంబుఁ గూడఁ
దోడుపడవలయుం గాని ♦ తోఁచినన్ని



యూహ లుపయోగపడునె? దై ♦ వోపహతున
కెంతశ్రమ గన్న జతనం బ ♦ దెంత యున్న.

తిమ్మ—దైవము మనపక్షంబున నున్నందుల కీవిభేదమే నిదర్శనము.

మేచ—మీయభిప్రాయమును సెలవిండు?

జగ్గ—తిమ్మరాజాదులకు గడువుదిన మెప్పుడు?

తిమ్మ—రేపె.

జగ్గ—ఆలాగా! చూతుఁడు. ఆసమయమున కొకయుక్తి చేయవలసి
యున్నది. అందులకై మనము కడు మెలఁకువతోఁ బని చేయ
వలయును.

మేచ—ఎట్లు?

జగ్గ—తిమ్మరాజప్రభృతులు తాము రాజున కీయవలసిన వన్నియును
రేపు స్వయముగఁ గొలువునకు వచ్చి యర్పించెద మని చిక్క
రాజునకుఁ దెలియఁజెప్పవలయును.

తిమ్మ—అది యెందులకు?

జగ్గ—మనకుఁ గోట స్వాధీనపడుటకు.

మేచ—అది యెట్లు?

జగ్గ—చిక్కరాజు, మంత్రి మొదలగువారు తనయాజ్ఞను శిరసావహించి
రను నానందమునఁ బ్రమత్తుఁడై యుండ మనము మనకార్యము
ను సాధించుకొందుము.

తిమ్మ—చిక్కరాజు ప్రమత్తుఁడైయున్న మన కేమి యొలికినది?

జగ్గ—ప్రమత్తత రాజ్యపదభ్రష్టతకే కాదా? ఆసమయమున మనము
పను లెఱుంగకుండఁ గోట నాలుగుద్వారంబులను ముట్టడించి
చిక్కరాయనికుటుంబసహితముగఁ బట్టుకొనవచ్చును.

మేచ—ఆహా! ఎంతసదుపాయముగా నున్నది?

తిమ్మ—ఈదినమె రాజపార్శ్వవర్తు లగుద్వారపాలకాదులను వశపఱచు
కొనవలసి యున్నది.

జగ్గ—అది యెంతటిపని! ప్రపంచ మంతయు ధనముతో నున్నది.

సీ. వనములఁ జరియించు ♦ మునిపుంగవుల నైనఁ
దశతశ్రుచుల చి ♦ త్తము గరంచు
ప్రథితాభిజాత్యసం ♦ పన్నుల నైనను
గలగలధ్వనులఁ జి ♦ క్కులను బెట్టు
సదసద్వివేకప్ర ♦ శస్తశీలుర నైనఁ
బైమెఱుంగులను గై ♦ వసము సేయు
ధర్మమార్గప్రవ ♦ ర్తకుల నైనను రూప
వృత్తవర్ణములఁ ద ♦ బ్బిబ్బు సేయుఁ
గీ. దలఁచి చూడంగ నెంతవా ♦ రలను నైనఁ
దనవశంబున మెలఁగించు ♦ కొనఁగఁ జాలి
తనకుఁగాఁ బ్రాణముల నైనఁ ♦ గొనఁగఁగలదు
ధనము జనవశీకరణసా ♦ ధనము గాదె?

మేచ—అవును. సర్వవిధముల మనప్రయత్నములు ఫలింపఁగలవు.

తిమ్మ—ఈసమయమున యాచశూరుఁడు సమీపమ్మున లేకుండుటఁ
గూడ మనకు శ్రేయస్కరమే.

జగ్గ—ఆతఁ డుండిన నేమి చేయఁగలఁడు?

తిమ్మ—అ ట్లనఁగూడదు. ఆతఁడు సమర్థుఁడు; రాజపక్షపాతి; మన
ప్రయత్నము లించుక తెలిసినను నాతఁ డడ్డుపడక మానఁడు.

మేచ—అట్లయినచో నాతనిఁగూడ మనలోఁ గలిపికొంటిమేని మనకా
ర్యము నిరాతంకముగాఁ గొనసాగును.

జగ్గ—అది సంభవింపదు. ఆనాఁడు సభలో మహారాజు నెదుట దిక్క-



రాయని వెనుకవేసికొని వచ్చి ముఖాముఖిని నాతోఁ గలహ
మాడుటయె గాక శపథముగూడఁ జేసినయాతఁడు మరల మన
తోఁ గలియునా? అది కల్ల. అట్లు కానేరదు.

తిమ్మ—ఆతనికిఁ గొంతరాజ్యమునైన నొసంగి మనలోఁ గలిపికొంటిమేని
మనప్రయత్నము నిరాఘాటముగాఁ గొనసాగును.

మేచ—ఆతఁ డట్టిపనుల కియ్యకొనఁడు.

గీ. మానధనుఁడు, సత్యవచన ♦ మహితుఁడు, పటు
శౌర్యరాశి, ధీనిధి, మహా ♦ దాస్యవిభవుఁ
డట్టియాచశూరుని సల్పు ♦ నట్టు లీవు
దలఁతె? యినునకుఁ దమ మంటఁ ♦ గలుగు నయ్య!.

తిమ్మ—అట్లయినచో నతఁడు దూరమున నుండెను గాన రాజును బం
ధించుపని రేపె చేయుదము.

జగ్గ—దగ్గఱనున్నమాత్రి మేమి చేయఁగలఁడు?

తిమ్మ—ఇపుడే మన మీప్రయత్నము చేసినయెడల మనకు జయము
కలుగుట తప్పదు.

జగ్గ—ఔ నౌను!

ఉ. ఔరసుఁ డుండ నానృపతి ♦ యన్యున కేటికి రాజ్యమిచ్చె? న
న్నారసియైనఁ, బత్నిమది ♦ నారసియైనఁ, గుమారచిక్కరా
ద్భూరమణున్ మహీశునిగఁ ♦ బోలదె చేయఁగ; నట్లు చేయలే
దూరకె జగ్గరాజువలు ♦ కోటుగఁ బోవునె? క్రోధ మాఱునే.

మనము రేపటిదినముననే మనవిధాయకకృత్యముల నిర్వర్తిం
తము. ద్వాదశసహస్రసంఖ్యాకం బగునుత్సైన్యంబుం గొని
మాయొబళుండు ప్రాగ్ద్వారంబునను, షట్సహస్రసేనాపరివృ
తుండై తిమ్మనాయకుండు పశ్చిమద్వారంబునను, ప్రధానదండ

నాథతిమ్మరాజప్రభృతులు వారివారిసైన్యంబులతో దక్షిణోత్త
రద్వారంబులను గాచికొని యుండఁ, గాఁగలకార్యంబు దనచ
తుస్సహస్రపరిమితసేనతో మేచరాయండు లోని కరిగి నిర్వ
హింపఁగలఁడు. ఇంతవఱకు మనరహస్యములు బయలఁ బడకుం
డుటచేతఁ బ్రజాసంక్షోభంబునకుంగూడఁ గారణం బుండదు.
మనముముందుగ నేగి మంత్రితిమ్మరాజును గలిసి యాలోచించు
కొనవలయును. పోవుదము రండు!

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము

శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## తృతీయాంకము.

రంగము—చంద్రగిరిలోని రజకగృహము.

(ప్రవేశము—చాకలిబలిగాఁడును, పేరంటాలును.)

బలి—అబ్బ! ఱెక్క లడిపోయినాయి. జైలోళ్ల బట్ట లన్నీ ఒకెత్తు, ఈబట్ట లొకెత్తు. ఎంతుతికినా కుళ్లు పోందే! ఉస్! ఈయాల ఱెక్క లడిపోయినాయి.

పేరం—మారాజుల ఱెక్కలు కట్టడిపోయినప్పుడు సాకిరీవ్రాళ్లం మన ఱెక్క లడిపోవడం యేయి లెక్కరా?

బలి—ఔను. పాపం పెదబాబుగారికి ఎంతుతికినా మునపటి బట్టల్లాగ చేయలేం గందా!

పేరం—పాపం. పెళ్లికూతురుగారు సాకిరీవ్రాళ్లకు పారేసే గుడ్డలుకూడా దగదగ లాడతా వుండేయి. ఆలాంటి మారాజుల కీముతక గుడ్డలా? అయిపుట్టినోళ్లకీ అతికారా లొచ్చాయి. అనుకుంటే

తప్పు. వూరుకుంటే ముప్పు. అయిం దాకుల్లోను కాంది కం
చాల్లోను. ఇంతకీ పెద్దరాజుగారు సచ్చిపోవడంచేత యీమా
రాజు కింత గతొచ్చింది. ఆయనుంటే జగ్గరాజుగా రింతపని కొ
డమడగలడా?

బలి—ఔను. కుక్కిన పేనులా గుండోడు.

పేరం—బాయమ్మా దేవిగోరు మాత్రమో?

బలి—అవును గాని చిన్నబాబుగారిని బాయమ్మగారు కన్లేదనుకుంటా
రేంటి? దోమయ్యగారు వొడ్లోవుంటేమి. యీమయితేమి.
యీయాల్ దాకా యీగొడవ లేదు గనుక నిన్నడగ మరిసినా
ను. ఇదుగో! సూడు! నాతో సత్తెం సెప్పు!

పేరం—అబ్బే! ఈయూసెందు కిప్పుడు. ఆ రతికారులు. మనకేం సి
క్కులొత్తాయొ?

బలి—దానికేం లే! ఒలే పేరంటాలు! మనింట్లో మారాజును మాల
ముండకొడు కనుకుంటాము. లోయి ముయ్యగలం గాని లోకం
ముయ్యగలమా యేంటి?

పేరం—కడుపు సింపుకుంటే కాళ్లమీద బడద్ది. యీగొడవంతా యెం
దుకు? యీమయితేం. మారా జయాడా?

బలి—అద్దు గావూసే. నీకు తెలం దే ముంది? అన్నప్పుడూ లోగిట్లో
మసిలీదానివి. అయితే అప్పుడు బాయమ్మగోరికి గాజు లట్టించా
రుగారూ!

పేరం—అన్నీ అయాయి. ఉతకాలూ అయాయి.

బలి—సత్తెంగా అమ్మగారికే.

పేరం—ఎవరైతేయి అవూసిప్పు డెందుకూ!

బలి—ఒలే నాకాడ దాపరిక మేంటే సిగ్గేంటో లప్పా



పేరం—ఎవడో దిక్కుమాలి నోణ్ని దెచ్చి పుట్టేడు, పుట్టేడు అని గద్దె
క్కించడానికి ఆళ్లకే సిగ్గులే నప్పుడు నాకేం సిగ్గు.

బలి—అదేంటే ఆలాగంటావు! అసలింటి జందెపోడంట!

పేరం—ఎవడో వొడు. ఇందరి పానాల కలజడి గలిగిందిగందా?

బలి—ఆకన్నతల్లి కెంతరాయి గుండో. ఒక్కమాటేనా అమ్మా అం
టాడా? సూడనైనా సూడ్డాని కొల్లా?

పేరం—యీమయితేయి. అవిశ్శెరం అబ్బింది గందా! తల్లీ బిడ్డా?
అన్నా దమ్ముడూ అయినప్పుడు ఏయేలో కలకుం డుంటారా,
అదేం మాట!

బలి—(మెల్లగా) ఒలే! అసల్తల్లుం దేమో?

పేరం—ఏమో! వుందో వూడిందో?

బలి—యిదంతా తెలిసిపోద్దని యిసమెట్టి చంపలేదు గందా?

పేరం—అంతప్పురాల్లో యేంజరిగిందో మనకేం తెలుత్తది?

బలి—ఓలప్పా! కడుపు చెరువై పోద్దే! గంపెడిపిల్లలతో టాచెరలో
నున్న మారాజును సూత్తేను!

పేరం—యీనాటి కేంగతి పడద్దో యేంతెలుత్తది?

బలి—ఔనులే! ముసలిరాజుగారు తనమాటయిన లేదని, యీకుఱ్ఱో
డికి యిది కట్టిపెట్టాలనీ గందా యీమారాజు మీదింత కచ్చ
సాదించా డాజగ్గరాజు!

పేరం—ఆకుఱ్ఱోడు మాత్ర మేంతెలివై నోడు! అతికారం పట్టిన మూ
ణ్ణాళ్లే పొట్టపొగలైనా అనబగించగలడా? ఆమాల్లీ తే తెల్దు.
ఈడా కుటుంబంలో వాడైతే గదా తెల్సును! కుక్క నందలం
యెక్కిత్తే శెప్పులన్నీ శెడగొట్టికినట్టే!

బలి—ఔను. ఏగూటి శిల కాగూటి పలు కన్నమా టాబద్దమా
యేంటి? యీడక్కరికి రాడు.

పేరం—ఆడికి దేముడూ లేదు. గురువు లేదు. ఒకళ్లకంటా బద్దు గం డా! ఆరాచటీవే లేదురా! అత్తమానం ఆముగ్గురినీ బెట్టుకుం టాడు.

బలి—ఓరారు?

పేరం—ఓరా? ముసిలితాతోడు. ఇన్నింటికి మూలం యీ చకునిగాడే ఆడితోటి చానాపతు లిద్దరు.

బలి—ఈడి కీలు ఆళ్లల్లో వుందందూ? అయితే ముసిలిరాజుగారి కిదం తా తెల్సునా?

పేరం—తెలి సేంసేత్తా డేంటి? బాయమ్మాగోరంటే పడిసచ్చీవోడు. బతికున్నా రోజుల్లో నేను సెప్పలేను గాని ఆయిడ గోసిగు డ్డె ట్టుకోమంటే పెట్టుకునీ వోడుగందా. కాని యెంత సివాఁలాడిం చినా అరీ యనీ కాలానికి నాయమే సేశాడు, సచ్చి సొర్గాన్ను న్నాడు ఆయ న్నేమనుకోన్నా పాపం. యెందుకు నాయనా! మనం సాకిరీవోళ్లం.

( తెరలో )

ఎందుకు నాయనా? మాము సాకిరీ వోళ్లం ఎవ ర్రమ్మన్నా రా వాల, యినయందరయ్య గారా? ఆలాగే వత్తా నెల్లండి బాబూ!

పేరం—అదుగో! మీబాబా వొత్తున్నాఁడు. ఇంకీ వూసెత్తకు. కోంపడ తాఁడు. లోనికెల్దాం.

( అని నిష్క్రమింతురు. )

రంగము—వినయంధరునిగృహము.

( వినయంధరుఁడు, వేంకటదాసును ప్రవేశించుచున్నారు.)

విన—( నిట్టూర్పువిడిచి ) అక్కటా!



ఆ. కల్పభూరుహంబు ♦ కడ తేఱిపోవంగఁ
గుందుచున్నయర్థి ♦ కోటులకును
జిక్కె రాజరాజ ♦ చింతామణీప్రసా
దంబుకూడ వశముఁ ♦ దప్పిపోయె.

అయ్యో! దాసవరా! నేను పాపాత్ముఁడనే కానియెడల నా కీ ఘోరకార్యములం గన్నారఁ జూచుచు ఆదుఃఖవశంబున లో లోనం గుళ్లుచు ముక్కాలిముదుసలి నయ్యు నీపాడుజీవముల తో కష్టతరమైన యీదేహయాత్ర నెట్లు నడుపుకొనుట సంభ వించును? ఇది యంతయును నాపాపము. నాప్రారబ్ధము.

దాస—అయ్యో! విచారించిన నేమి ప్రయోజనము? ముందుగతి చూ డవలయునుగదా!

విన—మనమెవ్వరిని రాజుగాఁ దండ్రిగా, దైవముగాఁ దలంచుచుంటి మో యామహానుభావుఁడే కారాగృహమున సకుటుంబముగాఁ జిక్కుపడియుండఁ గన్నులుండియుఁ జూడలేక, చెవులుండియు వినలేక, చేతులుండియుఁ జేయలేక, నోరుండియు మాటడనేరక, వ్యర్థులమై, హీనులమై చెంతనుండియుఁ జేయునదిలేక బడుగు లమై యిట్లు పడియుంటిమి. ఇఁక మనరాజభక్తి యేల? కా ల్పనా? మనకు బుద్ధిలేదా? మనము దీనికిఁ బ్రతీకారము యో చింపవలదా?

దాస—ఆర్యా! అవశ్య మట్లుచేయుట లగ్గు. దురాత్ముం డగునీజగ్గరా జహతకునిమూలమునంగదా యింతపాటిల్లె!

విన—ఔనోయీ!

గీ. మనకుఁ బ్రభుభక్తి కలిగిన ♦ దనుటె కాని
ప్రభువు పరులచే నిడుమలఁ ♦ బడుచు నుండ

వెర వుడిగి హీనవరుల సే ♦ వింపవలసెఁ
గాలగతి నింతతప్పఁగాఁ ♦ గలదె విధియు?
మనబుద్ధిహీనతయే యింతముప్పునకుఁ గారణమైనది.

గీ. ధైర్యహీనుఁ డిపుడు ♦ తఱిగాదనుచుఁ జెప్పు
శక్తిహీనుఁ డధికు ♦ సరణి దెప్పు
నర్థహీనుఁడెప్పు ♦ డన్నింటికిని దప్పు
బుద్ధిహీనుఁ డఖిల ♦ మునకుముప్పు.

అట్లుగావున మనవెనుబాటును, అశక్తతయు, నర్థరాహిత్యంబును, బుద్ధిహీనతయు నీదురాత్ముం డింత విజృంభించుటకుఁ గారణంబులైనవి.

దాస—దురాత్ముం డగుమంత్రి, విశాఖపట్టణప్రాంతసామంతభూపాలురు సరిగఁ గప్పము చెల్లించుట లేదనునెపమున ప్రభువు నెల్లవిధములఁ గాపాడుకొనుచున్న యాచశూరేంద్రుని వారి నొంపఁబంపుటచే నింత సంభవించినది.

విన—ఇదియును జగ్గరాజు మాయాప్రయోగమే. ఏమందు వేని, తన దుష్కార్యమును నిరాతంకముగఁ గొనసాగించుకొనుటకు మంత్రి తిమ్మరాజు నాధారముచేసికొని యిట్టి పన్నాగమును బన్నెను. విధివిధాన మిట్లుండుటచే మహారాజచిక్కరాజు యాచశూరు నెన్నఁడు నెడఁబాయకుండు మని బోధించిన వృద్ధరాజేంద్రుని హితవచనమునుగూడఁ బాటింపఁ డయ్యెను.

దాస—ఇన్నియుం గూడుటచేతనే యిట్లుపుట్టి మునిఁగినది. ఏదియెట్లైనను యాచశూరుం డిచ్చటనే యున్నచో నింత పని జరుగదు.

విన—కాదా! ఆవిక్రమశీలున కపజయ మనుమాటకూడఁ గలదా!

సీ. చిక్కరాజనృపాల ♦ శేఖరునాజ్ఞ మ
న్నించినాఁడు పరాక్ర ♦ మించినాఁడు



వైశాఖపట్టణ ♦ ప్రాంతసామంతుల
నొంచినాఁ డాజి శి ♦ క్షించినాఁడు
ముష్కరాధిపులచే ♦ మోడ్పుతోఁ బన్నువె
ట్టించినాఁ డాజ్ఞ పా ♦ లించినాఁడు
అరిఁ గొనఁ దనయు లిం ♦ గప్ప నం దధిపుఁ గా
వించినాఁడు యశంబు ♦ నించినాఁడు
మలయు నరిహరిణముల బె ♦ బ్బులివిధానఁ
గలచుటం జేసి యందు బె ♦ బ్బులిసమాఖ్య
మించుకోటను గట్టింప ♦ నెంచినాఁడు
యోధమాత్రుండె? యాచశూ ♦ రోత్తముండు.

దాస—అంతటివిజయముం గాంచిమించిన యాచశూరునకు మహారాజును యథాపూర్వస్థితిం జూచునప్పుడుగదా సంతసము!

విన—ఆతఁ డట్టివాఁడే. దురాత్ముం డగుజగ్గరాయ లాయాచశూరునకుఁ గొంతరాజ్యము లంచ మిచ్చెద ననియుఁ, దమకు బాసటయై యుండు మనియు వార్త నంపెనఁట! ఆదురాత్ముఁడు తన యవగుణమును వెల్లడించుకొనియెనేకాని యామహాత్ముఁ డందుల కంగీకరించునా?

దాస—అంగీకరింపఁడు.

సీ. ఆనాఁడు జగ్గరా ♦ యఁడు దన్ను సభలోనఁ
బలికినపల్కులు ♦ తలఁచికొనఁడె?
తన యెడఁ గల్గునా ♦ తనివైరభావంబు
తిరమైన దని మది ♦ నెఱిఁగికొనఁడె?
కడసారి యిడిన వేం ♦ కటపతిరాయని
యానతి నొదల ♦ నాసికొనఁడె?

అదిగాక చిక్కరా ♦ యని రాజు గష్టుని
హెచ్చరించుట జ్ఞప్తిఁ ♦ దెచ్చికొనఁడె ?
క్రూరు లగుపారితప్పుడు ♦ క్రూరతలకును
దుష్టులయపోహములకు వ్య ♦ ర్థప్రలాప
ములకు లక్ష్యంబుచేయునే ♦ యలఘునుగుణ
సాంద్రుఁడై యొప్ప యాచశూరేం ♦ ద్రఘనుఁడు ?.

విన—అతఁ డూరకుండువాఁడు కాఁడు. అసామాన్యమేధానిధి యగు నాతఁ డీవిషయమున నెల్లప్పుడు నాలోచించుచునే యుండు ననుట ధ్రువము. ఉదారగుణుండగు నామహాబలుఁడు చేసి చూపువాఁడే గాని వ్యర్థవాది గాఁడు. శత్రువిజయుఁడై వచ్చిన యామహామహుని సందేశమువలననే కదా మన మింతవఱకు జీవించియుంకుట !

(కృష్ణదాసు ప్రవేశించుచున్నాఁడు.)

కృష్ణ—జయము. జయము. ఆర్యవినయంధరా !

విన—అయ్యా ! కూర్చుండుము.

కృష్ణ—(అట్లుచేయును.)

విన— మహారాజయాచశూరుఁడు ప్రమదమున నున్నాఁడా ?

కృష్ణ—ఆ. ఉన్నాఁడు—

విన—ఎట్లు ?

కృష్ణ—ప్రయత్నమున—

విన—సార్వభౌమనిర్బంధవిమోచనప్రయత్నమునా ?

కృష్ణ—అది గాకున్న ప్రమద మెక్కడిది ?

విన—కృష్ణా ! కర్ణానందముగ నేఁడు వినఁదగిన మాట వింటిని !

దాస—వినఁదగినదే కాదు. జరుగఁదగినది కూడను.



కృష్ణ—అట్టి యదృష్ట మార్యవినయంధరుని మేధాశక్తిపై నిలిచియున్నది.

విన—నాయనా ! అట్లుకాదు. మూఁడుగాళ్లముదుసలి నగునేఁ జేయున దేమి ? అస్మాదృశులకును సార్వభౌమునకుఁగూడ రక్షకుండగుభవత్ప్రభుని బాహుపరాక్రమమునం దనుము.

దాస—ఇంతకును దైవముకూడఁ దోడ్పడవలయును.

కృష్ణ—ధర్మమార్గప్రవర్తకులకు దైవము తోడ్పడకుండునా ?

విన—అది యథార్థము. ఆపదలు కాపురము సేయఁబోవు. దైవము మాత్రము నిర్దయుఁడా ? దృఢప్రయత్నమున నెట్టికార్యములును సిద్ధింపకపోవు. సంపూర్ణ మగురాజనీతి నిరాఘాటముగఁ బ్రవర్తింపఁ జేయువలయును.

కృష్ణ—ఆవిషయముంగూర్చియే మాప్రభుండు మీకు విన్నపింపుమని నన్నంపెను.

విన—(ఆతురతతో) ఆతఁ డేమని యాజ్ఞాపించెను ?

కృష్ణ—ఆర్యా ! ఆజ్ఞప్తికాదు. విజ్ఞప్తి. సావధానమనస్కులరై వినుండు.

చ. మనప్రభుఁ డీకుమారునిఁ బ్ర ♦ మాదముఁబొందకయుండ స్వర్గముఁ
గన్గొన నేగునాఁడు కరు ♦ ణామతి మీఱఁగ మీకు నాకుఁ బె
త్తన మిడి యొప్పగించెను గ ♦ దా ! ప్రభునానతిఁ దీర్పలేమ ; క్ర
న్నన మన మింక నైన జత ♦ నంబున లోపముఁ దీర్పఁ జెల్లదే !

విన—సాధు ! యాచశూరేంద్రా ! సాధు ! ప్రభుభక్తిపరాయణతకు నీకీ డెవ్వరు ?

కృష్ణ—ఆర్యా ! ఇంకను వినుండు.

గీ. రాజభక్తిలేని ♦ ప్రజ చెడిపోవును
ప్రజలఁ క్షేమఁ గనని ♦ రాజు చెడును

ప్రస్తుతప్రభుండుఁ ♦ ప్రజలు పరస్పర
శత్రువులైరి మనకుఁ ♦ జన దుపేక్ష.
గీ. మనపతికి లగ్గు ప్రబలశ ♦ త్రువునకు నెగ్గు
గలుగుమార్గంబు మీచేతఁ ♦ గలదు గానఁ
దగినతటి వేచి రిపులయం ♦ తర మెఱింగి
వలయుగతిఁ గార్యతంత్రంబు ♦ జలుపుమయ్య.

విన—అహా! ఏమి యీయాచశూరేంద్రుని రాజనీతినైపుణ్యము! వృద్ధుండ నగు నాచేఁగూడఁ బనిగొనుచున్నది!

దాసు—బుద్ధిచేత మీరిరువురును వృద్ధులే కదా! రాజకార్యవిషయంబున వయోనిర్ణయ మేల?

విన—అదృష్టమున కన్వయమర్యాదవలెనా?

కృష్ణ—అల్పప్రభున కధికారతారతమ్యమువలెఁగూడను.

విన—(నిట్టూర్పు విడిచి)

సీ. ధర్మమార్గపవి ♦ త్రకులకుఁ గడగండ్లు
దురితాత్ములకు నిరం ♦ తరశుభములు
ధారిణీపతులకుఁ ♦ గారాగృహంబులు
నల్పజాతులకు సిం ♦ హాసనములు
కులపతివ్రతలకా ♦ కులపాటు నగుఁబాటు
గుడిసెవేటులకుఁ గ్రా ♦ త్తులసేవ
సత్యవాదులకుఁ ద ♦ ర్జనభర్జనంబులు
ప్రియువాదులకును బు ♦ రేబలాలు
గీ. స్వామిభక్తుల కెందు న ♦ వాచకములు
రాజవిద్రోహులకు సమా ♦ రాధనములు
బుధులకును భీతి ఖలజనం ♦ బులకుఁ బ్రీతి
కాలమా! యెంత కైనను ♦ జాలు దీవు.



కృష్ణా! అరాజకమగు దేశమున నైన నలజడి లేకుండ జీవింప వచ్చును గాని, యల్పుని పాలనమునకు లోఁబడి యుండు టతి కష్ట మతికష్టము. నేనిప్పుడు శత్రుమధ్యమున నున్నను సముఁడనై మెలఁగుచుండుటచే యాచశూరేంద్రుని యుద్యమము తోఁగూడ వృద్ధమహారాజాజ్ఞ సంపూర్ణముగ నెఱవేఱఁగల దను నాశ యింకను వదలలేదు.

దాస—అట్టిమనయాశ జగ్గరాయని యవివేకముతోఁగూడ ఫలింపవలయునుగదా!

విన—సర్వతంత్రస్వతంత్రుఁ డగుయాచేంద్రుని సమయజ్ఞత మనకు బాసటమై యుండ నదియెంతటిపని?

దాస—జగ్గరాయని దుండగములం గన్నారఁ జూచుచుఁ జేయునది లేక, దిక్కులేక, విచారమునకుఁ బరిమితిలేక, అరులనూడుమాటలు విన లేక, పురుషకారమునకుఁ దగినఫలము లేక యనదలమై యబలలకంటె నధములమై జీవించియుండు టెంతకష్ట మెంతకష్టము!

విన—అబ్బ! పితృపైతామహం బగురాజ్యముం బరిగ్రహించి యఖిల జనహృదయాహ్లాదకరంబుగఁ బరిపాలించుచున్న మహారాజును మారు సుకుమారుఁ జిక్కరాయల నానాఁడు పట్టపగలు నిండోలగంబున నారీతి నవమానించి సకుటుంబముగఁ గారాబద్ధునిం జేసిన రాజద్రోహులగు నాదురాత్ములకుఁ దగినశాస్తిఁ జేయువఱకు మన మబలలకంటె నధములమే. నిజము నిజము.

ఉ. లంచము లిచ్చి సైన్యపతు ♦ లన్దనవంకకుఁ ద్రిప్పి ద్రోహులై
వంచన భూమిపాలున క ♦ వజ్ఞ యొనర్చుటె కాక పట్టి బం
ధించి సపుత్త్రదారముగఁ ♦ దీవ్రతరుండయి కారలోనఁ గా
ఱించుచు నున్న వైరుల హ ♦ రింపని పౌరుష మేల కాల్పనే?

దాసు—ఇప్పు డేమనుకొన్న నేమి? కార్యాంతర వ్యాసంగంబున యాచశూరుం డప్పుడు మనల విడిచియుండుటవలనను, నీదుస్తంత్రింబు లించుకంత యెఱుంగని మహారాజు ప్రమత్తుండై యప్రయత్నంబున నుండుటవలనను నింతపుట్టెను గాని లేనియెడల రాజవిద్రోహులగు శాత్రవులు కోటలోనికి రావచ్చునా?

(తెరలో)

లోనికి రావచ్చునా? ఎవ రక్కడ?

కృష్ణ—(సంభ్రమముతో) ఎవరు చెపుమా! మనమాటలు వినుచుండుట లేదుగద!

విన—అరయుదముగాక! అయ్యా! దయచేయుఁడు.

(వీరనారాయణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

న—దండనాథాగ్రణీ! యిందుఁ గూర్చుండుఁడు.

వీర—(అట్లు చేయుచున్నాఁడు.)

దాస—(అపవారించి) ఏమిది! ఈసమయమున నీతఁ డేల వచ్చెను! మఱల నేమి పుట్టిమునుఁగ నున్నదో గదా!

విన—(అపవారించి) అయ్యో! మనమంత్రము బయలువడు నేమో! (ప్రకాశముగా) అయ్యా! మీరు విచ్చేసిన కార్య మేమి?

వీర—(సంశయించుచున్నాఁడు.)

విన—సంశయ మేల? వీరు మనవారే. సెలవిండు.

వీర—సంకోచ మే లేదు. మఱియు మఱియు రాజవిద్రోహములు పుట్టుచున్న యీసమయమున మనను నే నమ్ముట కవకాశము లేక యున్నది.

విన—మనకుమారచిక్కరాయనివిషయమున మఱల నేమైనఁ బ్రయత్నములు జరుగుచున్నవా యేమి?



కృష్ణ—(తనలో) ఆహా! ఈవినయంధరుఁ డెంతటి సమయజ్ఞుఁడు!

వీర—(తనలో) ఏమిది యీతఁ డిట్లనుచున్నాఁడు! బుద్ధిమంతులగు వా రుచితవచనములచే నెదుటివారి హృదయముల నెఱుఁగు వఱకుఁ దమయభిప్రాయములను వెల్లడింపరు. (ప్రకాశముగా) ఆర్యవినయంధరా!

గీ. ఘనవిరామ్రూప మష్టబం ♦ ధనము వదలి
ధరణిపైఁ గూలఁబడఁగ ను ♦ త్సవుఁగతికి
నెఱియుగతిఁ గారఁ బడియున్న ♦ నృపునిమాట
యడుగ కీచిన్నచిక్కనిఁ ♦ దడవె దేల?.

విన—అయ్యా! ఏమి యిట్లు పలుకుచుంటివి? ఇదియే కదా రాజవిద్వరమునకు మూలమైనమాట!

వీర—ఇదేమి నేఁడార్యునివలన వినరాని వాక్యములు వినుచుంటిని!

విన—ఈతఁడు పలుకరానివి పలుకుచున్నాఁడని మీయభిప్రాయమా?

వీర—అంతమాట నేననఁగలనా!

విన—అట్లయిన రాజభక్తి మీవాక్యముల నున్నదా?

దాస—మాటలో లేకున్న హృదయమున నుండఁగూడదా?

కృష్ణ—హృదయమున నెటులున్నను మాటలమాత్ర మగపడకున్న రాజదండనమునకు లోనుగావలసివచ్చును.

వీర—మనోవాక్కాయకర్మల నొక్కరీతిగ నున్న మన కేమి?

విన—దండనాథాగ్రణీ! మీ రట్టినిర్మలహృదయులే యగుదురు.

వీర—ఏమైననేమి? చేతఁగానివారమై యుండవలసివచ్చినది.

విన—అదేమి?

వీర—వీరవేంకటపతిమహారాజుపై మనకు భక్తివిశ్వాసములు లేవా?

విన—లేకేమి?

వీర—ఆమహామహునియాజ్ఞ మనము పాలింపవలసినది గాదా!

విన—అవశ్యము.

వీర—కాఁబట్టి,

గీ. క్షితిపునానతి రాజుగాఁ ♦ జేయఁబడిన
చిక్కరాయునిఁ జెఱఁ బట్టి ♦ చెలఁగుచున్న
జగ్గరాజాదులకు భక్తి ♦ సలుప నగునె?
కులవిహీనుని విభుఁడని ♦ కొలువ నగునె?.

సీ. నిండోలగమునఁ గొ ♦ లువుండుమహారాజు
బందిగంబునఁ బడి ♦ యుండ నగునె?
ఇష్టమృష్టాన్నసం ♦ తుష్టినందెడుభోగి
మొక్కజొన్నలకూడు ♦ మెక్క నగునె?
రమణీయచీనాంబ ♦ రములఁ గట్టెడిమేటి
గొంగడిగుడ్డఁ గ ♦ ప్పంగ నగునె;
నిరతాన్నదానభా ♦ సురయశుం డగుదాత
దినవెచ్చ మొరునిచేఁ ♦ గొనఁగ నగునె?

గీ. హంసతూలికాతల్పంబు ♦ నందు నిద్రఁ
బొరయు పతి రాతినేలఁ గ ♦ న్మోడ్ప నగునె?
తగును మని కన్నులార నం ♦ తయును గాంచు
మనను నొకరాజభక్తుల ♦ మనఁగ నగునె?

విన—అయ్యా! మీవాక్యములు పరమార్థమునే సూచించుచున్నవి. అయినను,

గీ. గోముఖవ్యాఘ్రములవలెఁ ♦ గొంద; అమృత
కలితవిషఘుటికలవలెఁ ♦ గలరు కొంద;
అసమయం బిది యేమి సే ♦ యంగవచ్చు?
నెట్లు పో నెట్లు వచ్చునో ♦ యెఱుఁగరాదు.



దాసు—ఇది కాలమువలని దోషము.

సీ. తమలాభమునకు నెం ♦ తటిదారుణం బైనఁ
గావింపఁజాలు ము ♦ ష్కరులతోడ
నొకనితోఁ గలసిన ♦ ట్లుండి యొక్కని జేరి
సకలంబుఁ జెరుచు దుర్జ ♦ నులతోడ
సమయ మబ్బినదాఁకఁ ♦ జచ్చిన ట్లుండి సం
దైనఁ బైఁబడు ఘాతు ♦ కాళితోడఁ
దన కెంతొ మేలుఁ జే ♦ సినవాని దిగఁ ద్రోచి
యరులఁ జేరెడి కృత ♦ ఘ్నాళితోడఁ
గుచ్చితాత్ములతో లంచ ♦ గొండ్లతోడ
నిండి నిబిడీకృతం బగు ♦ చుండె జగము
తంత్రములు హెచ్చె నెమ్మది ♦ తఱుగఁ జొచ్చె
నమ్మికలు చచ్చె దుష్టకా ♦ లమ్ము వచ్చె.

కృష్ణ—అట్లనరాదు. సజ్జనులు లేకయుండిన జగము నిలుచునా? రాళ్లగనులలోను రత్నము లుండుట లేదా?

గీ. బరిణలో నున్నఁగస్తురి ♦ పరిమళించు
పగిది సుజనుఁ డడంగియు ♦ వన్నెకెక్కు
వెలువడియు మోదుగులు తావి ♦ చిలుకనట్లు
ఖలుఁడు వెలయఁడు తన్నెంత ♦ దెలిపికొనిన.

విన—అది సత్యము.

వీర—(తనలో) వీరికి నాయందు నమ్మకము కలుగుట లేదు. ఒకరి నొకరు నమ్ముటకుఁ దగినకాలమా యిది? కానిమ్ము. ఇది మంచిదే. (పత్రికా) మీమాటలపోడిమి యెట్లున్నను మీహృదయములను నేను గ్రహించితిని. ఈలేఖ మీసంశయమును నివారింపఁగలదు. చూడుఁడు. (అని యిచ్చుచున్నాఁడు.)

విన—(అందికొని) అయ్యా! ఇది యెవ్వరిచే వ్రాయఁబడినది?

వీర—ఒక భక్తశిఖామణిచే.

దాసు—రాజభక్తుఁడనియే కద!

వీర—ఔను.

విన—(లేఖ విప్పి చూచుట నభినయించి) కృష్ణా! ఇది చదువుము! ఇది మాప్రభుఁడగుయాచశూరునిచే వ్రాయఁబడిన ట్లున్నది. (అని యిచ్చుచున్నాఁడు.)

వీర—(తనలో) ఇతఁడు యాచశూరుని పరిజనములోనివాఁడా? ఆహా! ఈవినయంధరుం డెంతటి నేర్పరి! వ్రాఁత పోల్చి చెప్పుట కీతని చేతి కిచ్చినాఁడు.

కృష్ణ—(అందికొని) ఔ నిది మాప్రభువు వ్రాసినదే. (చదువుట నభినయించి.)

"మిత్రరత్న మగువీరనారాయణునకు—

చెలికాఁడా! గడచినదానివిషయమై విచారించుటలో మనమిరువురమును సమానులమే. నిరంతరరాజభక్తియందును నట్లే. దూరమున నుండుటచే నే నెల్లవిధముల రాజభక్తికిఁ గూడ దూరస్థుఁడ ననిపించుకొనుచున్నాఁడను. నేను విశాఖపట్టణ ప్రాంతభూపాలురం జయించి నాతనయుం డగులింగప్పనాయకు సందు బొబ్బిలిపురమునఁ బ్రతినిధిం జేసి వచ్చినను మహారాజుం బోఁగొట్టుకొన్న నా కాసంతోష మావంతయుఁ గలుగుట లేదు. మున్ను నిండోలగంబునవలెనే యిప్పుడు కారాగారంబునఁగూడ నీకు మహారాజసేవ లభించుటచే నీవు నాకంటె నదృష్టవంతుఁడవు. రాజరక్షణంబునకును దద్రాజ్యలక్ష్మీపునస్సంధానప్రయత్నంబునకును నీవు చేదువఁగా నున్నాఁడవు. నే



ను దూరముననున్నను నాప్రయత్నమునఁ గృతార్థత నందువఱకు నాయావచ్ఛక్తిని వినియోగపఱుచుచునే యుండెదను. మేనులు వేఱైనను మన మొక్కటి యగుటచే మనలో నెవ్వరు కృతార్థత నందినను సమానానందమునే యనుభవింపఁగలము. జగ్గరాయాదులకు నీపైఁ గలనమ్మకము చెడకుండ నప్రమత్తుండవై మహారాజపునరుద్ధారణసమయమునకై నిరీక్షింపుచుండుము. మహారాజు సకుటుంబముగఁ బట్టువడి యుండుటచేఁ బ్రజ లగతికులై యల్లాడుచున్నారు. రాజకార్యము ప్రజలమూలముననే ఫలింపవలసి యున్నది. ప్రజలకు సంతుష్టి కలుగుట కొక యుపాయము నాలోచించి యాకార్యభారము నార్య వినయంధరునిపై నిడితిని. అది నీతోడ్పాటువలన సిద్ధింపఁగలదు. మన కెల్లవిధముల నాతనివిశ్వాసము శ్రీరామరక్షయై యున్నది. భగవంతుఁడు మనకు విజయము నిచ్చుఁగాక.

ఇట్లు భవన్మిత్రుఁడు,
యాచశూరుఁడు."

విన—(లేచి వీరనారాయణునిఁ గౌఁగిలించుకొనుచున్నాఁడు.)

వీర—ఆర్యా! మనము స్నేహగుణముచేతనే కాక యాచశూరుని నీతివల్లికచేఁ గూడఁ గట్టఁబడితిమి.

విన—(ఆనందముతో) ఓ నీతివల్లికా! ఆఘనతరుం జేపట్టిననీవు జగమెల్ల నల్లుకొని వర్ధిల్లెదవు గాక!

దాసు—రజకునివలన వస్త్రమాలిన్యమువలెనే యీలేఖవలన మన హృదయకళంకము తొలంగినది.

విన—(స్మృతి నభినయించి) ఓహో! ప్రసంగవశమున మఱచితిని.

వీర—ఏమది?

విన—రాజకార్యమే.

దాసు—రజకుఁడు వచ్చియుండునా యేమి?

కృష్ణ—ఇదిగో నాయొద్ద సిద్ధముగా నున్నది (అని ధనవుసంచి యుత్తరము నిచ్చును.)

విన—(సంతోషముతో) యాచశూరుఁ డన్నియు సిద్ధము చేసియే పంపెను!

దాసు—ఆయనఘునిబుద్ధివాహినివలెనే సహస్రముఖములఁ బ్రవహించుచుండును.

వీర—ఈ ధన మెందులకు?

విన—కారాగృహపరిచారకుఁ డగురజకునిమేలిగుణమును విలుచుటకు. రండు! పోవుదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది తృతీయాంకము.

---

శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## చతుర్థాంకము.

రంగము—వేంకటగిరివీథి.

(ప్రవేశము—మాధవుఁడు.)

మాధ—యాచేంద్రమహారాజుగారు మధురాంతకమునుండి తమరాజధాని యీవేంకటగిరికి మార్చికొన్న పండ్రెండేండ్లలోనె యీపుర మెంతటిమార్పుఁ జెందినది! ఈవీథులు తీర్చి కట్టిన ట్లున్నారు. ఏగృహము లెవ్వరెవ్వరివో యీయూరిలోఁ బుట్టిపెరిఁగిననాకే గుర్తుపట్టుటకు వలనుగాక యున్నది. ఈవరుసగా నున్నసౌధము లెవ్వరివో! రాజబంధువులు నిలుచుమందిరముల వలె నున్నవి. అదిగో! ఆపోవువారి నడిగెదను. అయ్యా! ఈభవనములయం దెవ రున్నారు?—ఏమనుచున్నారు? దండనాయకు లనుచున్నారా? ఒకటి, రెండు, మూఁడు, నాల్గు, అయిదు, ఆఱు.—ఈయాఱుమందిరములును దండనాయకులవే

నా? ఏమంటిరి?—కావు. మహారాజదర్శనార్థమై వచ్చుగొప్ప
వారికి విడుదలుగా నీయఁబడు ననుచున్నారా?—అయ్యా! ఈ
దండనాయకు లెక్కడినుండి?—ఏమనుచున్నారు? చంద్రగిరి
నుండి యనుచున్నారా?—దయచేసి వారిచ్చటి కేల వచ్చిరో
తెలిపెదరా?—రాజరహస్యము లెవ్వరికిఁ దెలియు ననుచు
న్నారా? (పైకిఁ జూచి) ఈయన రాజరహస్యము వెల్లడి
చేసితినని కాఁబోలును వడివడిగాఁ బోవుచున్నాఁడు.—పోనిమ్ము.
కొంచె మాఁగి మాగోపాలుని యిల్లెచ్చట నున్నదో తెలుప
వయ్యా!—ఏమంటివి? అదిగో! ఆతఁడే వచ్చుచున్నాఁ డను
చున్నారా?

(గోపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

మాధ—ఓరి వృద్ధమర్కటమా! నీకు సాలెపురుగువలెఁ గన్నులు నెత్తి
నుండెనా యేమి? నేను మాధవుఁడను.

గోపా—(తేరి పాఱఁజూచి) బావ మాధవుఁడా! మహారాజసోదరుఁ
డగురాయభూపతితో నీవుకూడ వచ్చితివా?

మాధ—ఆ—పెరుమాళ్లతోఁ బూజారివలె.

గోపా—ఆలాగునా? త్రాడుతో దబ్బన మనుము. అందఱును సేమ
ముగ నున్నారా?

మాధ—ఇప్పటివఱకు.

గోపా—అ దేమి?

మాధ—ఏమి చెప్పను? వల్లకాటిరాజవిద్రోహములవలన దేశమంతయు
నల్లకల్లోలముగా నున్నది.

గోపా—భయము లేదు.

మాధ—ప్రాణభయమా?



గోపా—కాదు. శత్రుభయము.

మాధ—గోపాలా! ఇటు రా! (మెల్లఁగా) ఈ దండనాయకు లెవరు?

గోపా—గట్టిగా మాట్లాడకుము. వీరు సార్వభౌమభక్తులు.

మాధ—అయినచోఁ జంద్రగిరిని విడిచి యిచ్చటి కేల వచ్చిరి?

గోపా—వారిప్రభుం డిచ్చటనే యున్నాఁడు.

మాధ—కుమారచిక్కరాయం డిచ్చటి కెట్లు వచ్చెను?

గోపా—ఆతనికి జగ్గరాయనితో రాజ్యమును వదలి వెళ్లవలసి వచ్చును.

మాధ—ఎందుచేత?

గోపా—మనమహారాజయాచశూరుఁ డీదండనాయకులతోఁ గలిసి బా
హుపరాక్రమముం జూపి తరుమఁ బోవుటచేత—

మాధ—అయ్యో! మహారాజకుటుంబమంతయు వారిచేతిలో నున్నప్పు
డెవ్వరికొఱకీ పరాక్రమవిజృంభణము?

గోపా—కుమారసదృశుం డగుశ్రీకుమారరంగరాయనికొఱకు—

మాధ—ఆతఁడుమాత్రము కారాగారమునఁ దవిలి తండ్రితో నిడుమ
లం బడుచుండుట లేదా?

గోపా—లేదు. సామంతదండనాయకులతో మనమహారాజుభవనమున
సురక్షితముగా నున్నాఁడు.

మాధ—ఏమేమీ! వినఁదగినవార్త వింటిని! ఇచ్చటి కెట్లు వచ్చినాఁడు?

గోపా—అది దేవరహస్యము.

మాధ—మనలో మనమాట. మన మొగములతోఁ జెప్పఁ బోవుదుమా
యేమి! చెప్పుము!

గోపా—చెప్పుట కేమున్నది? మహారాజయాచశూరునిబుద్ధిబలమున—

మాధ—ఊఁ.

గోపా—వృద్ధకంచుకి యగునాద్యవినయంధరుని రాజభక్తిమూలమున—

మాధ—ఊఁ. చెప్పుము.

గోపా—వీరనారాయణునివిశ్వాసవశమున---

మాధ—చరణాయుధనాథయుద్ధమువలె నీవాక్యమున కంతము కనఁబడ దేమి?

గోపా—కారాగారపరిచారకుం డగుచాకలివానిసాహసకృత్యమున---

మాధ—ఆచాకలివాఁడు తీసికొని వచ్చెనా?

గోపా—ఔను.

మాధ—ఎట్లు?

గోపా—ఒరు లెఱుంగకుండఁ దనబట్టలమూటలో మెలకువగ నాబాలకుని నిఱికించుకొని తెచ్చెను.

మాధ—వాఁడు వాఁడికత్తిమొనవలెఁ జుఱుకుఁదనము గలవాఁడే? కార్యసానుకూలము చేసి యెంతబహుమానమును గొనియెను?

గోపా—బహుమానమున కేమిలే. వానిరాజభక్త్యతిశయమును జూడవలయును. మహారాజును గుప్తముగఁ దెచ్చి యిచ్చినవానికే మిచ్చిన నేమి? అయినను మహారాజయాచశూరునిచేఁ గొంతధనము వానికిఁ బారితోషికముగా మనకృష్ణదాసుచే నార్యవినయంధరునియొద్దకుఁ బంపఁబడినది.

మాధ—సరే.

గోపా—కాని, వాఁ డది స్వీకరింపలేదు సుమా!

మాధ—ఆహా! ఏమి వానిప్రభుభక్తిపరాయణత!

గోపా—అంతియె కాదు, హీనసేవాపరాఙ్ముఖతగూడ ననుము.

మాధ—ఆలాగా! అవును. ప్రజల కాజగ్గరాజునెడ సంతతిద్వేషభావమే పుట్టినది.

గోపా—పుట్టదా? కులహీనునిం గొలిచియుండుట కెవ్వ రంగీకరింతురు?



మాధ—కొలుచువారు లేకుండినఁ గుమారచిక్కఁడు సార్వభౌముఁ డెట్లయ్యెను?

గోపా—దాని కేమిలే. అదృష్టము పట్టినప్పు డందఱును భృత్యులే. కాని, యన్వయమర్యాద లెట్లు పట్టువడును? ఉత్తమక్షత్త్రియకులాలంకారు లగుసామంతదండనాథభూపాలురు తనకు నమస్కరింపవలయునని యాజ్ఞాపించె నఁట! బుద్ధిహీనులై పౌరుషవిహీనులగువా రందుల కొడంబడి యనదలవలెఁ గొలుచుచున్నారు. అది సహింపకయే గదా మగతనమున నెగడుచున్న యీదండనాయకులు మనమహారాజుతో నేకీభవించినది?

మాధ—అట్లు చెప్పుము. మారాయభూపాలునకును మొన్న సీమధ్యఁ దనకుఁ గప్పము కట్టవలసినదని తెగబారెడులేఖ జగ్గరాజు వ్రాసి యనిపినాఁడు. ఆవిషయమై యాలోచించుటకే గదా రాయభూపతి యిటకు విచ్చేసినది! ఈకారణముననైన మనము కలిసికొన్నందులకు సంతోషముగా నున్నది.

గోపా—అవును. బావా! చాలకాలమైనది. మనము దేవాలయములోఁ జూచికొన నక్కఱ లేదు కద!

మాధ—అక్కఱ లేదు. యాచశూరభూపాలుఁ డీవేంకటగిరిరాజ్యమును శత్రువులచే మఱలఁ గొనినది శాలివాహనశకము 1524 సంవత్సరమునఁ గదా! ఆ మరుచటిసంవత్సరముననే మధురాంతకమునకు నన్ను రాయభూపాలునికడకుఁ బంపిరి. ఇప్పుడు 1535 వ సంవత్సరము. ఇంకను బండ్రెం డేండ్లు పూర్ణముగా నిండ లేదు.

గోపా—అట్లయైన నొక్కసారి యింటికిఁ బోయి యాచశూరునికొల్వు

నకై మఱలి వత్తము రా!

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.

రంగము—ఆలోచనామందిరము.

(విచారముతో యాచశూరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

యాచ—

చ. అవినతప్రాగ్దిశావనిత ♦ లాధిపవీరవరేణ్యులన్ మహా
హవమున నొంచి కప్పముల ♦ నంది తనూజుని లింగనాయకున్
బ్రవిమలరీతి నం దునిచి ♦ వచ్చినసంతస మేమిగల్గె నా
కవనిపుఁ డిట్టిబన్నముల ♦ నందుటఁ జూడఁగ నయ్యె నక్కటా!

చ. కలవర మందుచుండె మది ♦ కారణ మేమియొ కానరాదు; నా
వలన నొకింతయేని విడఁ ♦ బాటును గానమి రాజుచిత్త మే
వలనున నొచ్చుచున్నదియొ? ♦ భద్రముఖాదులు రాజమోచనా
ర్థులచట నేగతిన్ మెలఁగిరో? ♦ మఱి యాపద లెట్టి వయ్యెనో?

ప్రజలసంతుష్టికై కుమారశ్రీరంగరాయని నారజకసాహాయ్యమున నిటకు రప్పించి సురక్షితముగాఁ గాపాడుచుంటిఁ గాని యందువలన మహారాజచూడామణి కెట్టియాపద కలుగునో యని విచారించుచున్నాఁడను. ఉన్నది కారాగృహము. శత్రుమధ్యము. దుష్టజనసంకులము. ఆహా! రాజబంధవిమోచనమునకై నేను భద్రముఖాదులనెనమండ్రను నమ్మినభృత్యులను బంపితిని. వా రేగతి ప్రవర్తింపుచుండిరో యేమియుఁ దోఁచకున్నది. సమస్తమునకును వినయంధరవీరనారాయణులు కంటికి ఱెప్పవోలె రాజును సంరక్షించుకొనుచుండఁగా నాకీయ



లజడి యేల? ఈభయ మేల? ఏమో కాని కొన్నిదినంబులనుండి నాకు వినయంధరునియొద్దనుండిగాని, వీరనారాయణునికడనుండిగాని వార్త లేవియు వచ్చుట లేదు. ఇంతకును దండోపాయంబున కిది యదను గామింజేసి యుపాయాంతరప్రయోగాసక్తుఁడ నౌటచేతనే యింతయుత్తలపాటు పడవలసి వచ్చెను.

గీ. శౌర్యమే భుజబలముగా ♦ శత్రువిజయ
మే మనికిగా యశోరమా ♦ యితనితాంత
భోగభాగ్యంబులకుఁ దాను ♦ మూలమైన
పద్మనాయకవీరుని ♦ పట్టె నయ్యొ.

గీ. పగర నొంపక నిర్వాణ ♦ పదవిఁ గనక
రెంటికినిగూడఁ జెడినట్టి ♦ రేవఁడనయి
నృపతియానతిఁ బాలింప ♦ నేర కవనిఁ
బ్రదికి యుండితి జీవచ్ఛ ♦ వంబ నగుచు.

చ. జనకుఁ డనేకయుద్ధముల ♦ క్ష్మాతలనేతకు మేలుఁ గూర్చి మ
న్ననలను బొంది శౌర్యలల ♦ నామణిఁ జేకొని స్వర్గ మేగియున్
దనయసమానకీర్తివల ♦ నన్ భువి నుండినయట్లులుండె; నే
ననఁబ్రభునాపదన్ గనుచు ♦ నక్కట! లేకయ యుంటి నుండియున్

ఓలక్ష్మీ! నీవు చంచలురాలవు. కానియెడల నొకనియందును గూడ నిలుకడఁ గనక చలపాదివై యిట్లేల తిరుగుచుందువు? ఎంతటియోధులైనను, నెంతటిబుద్ధిశాలులైనను నిన్ను గట్టివేయఁజాల కున్నారు. ఛీ! ఛీ! నిన్ను నమ్మరాదు. కానిమ్ము. కానిమ్ము. నీగుణమే వెల్లడించుకొంటివి. కాకున్న నుత్తమగుణసంజాతుం డగుమహారాజును వదలి కులమును గుణమును గూడ లేనియధమాధముఁ డైనకుమారచిక్కని నేమిటికై యా

శ్రయింతువు? ఆహా! కాల మెట్లుగా మాఱి పోయినది?

గీ. మానసామ్రాజ్యసంపద్వి ♦ హీను లగుచు
సుగుణులు కులీను లిడుమలఁ ♦ దగిలి యుండ
దొంగ కానుపుకొడుకు లు ♦ ద్యోగమతిని
రాజ్యములు చేయుచుండిరి ♦ రాజు లగుచు.

ఎన్నఁటికైన మహారాజును సురక్షితముగాఁ గుటుంబసహితము
గా నీవలకుఁ దప్పింపఁ గలుగుదునా? అబ్బ! నా కీయులజడి
తీఱునా?

చ. ఒకతఱియే నిమేషమున ♦ యోధసమూహముతో విరోధిరా
ణ్ణికరము మట్టు బెట్టి ధర ♦ ణిన్ బగ డింపగ లేక కా దుపా
యకరములన్ బెనంగు టిపు ♦ డాదురితాత్మకుఁ డేమిచేయ లే
కకట! తెగించు రాజు నెడ ♦ నన్న భయంబున నూర కుండితిన్.

గీ. జగము లలరించుశక్తిచే ♦ నెగడుచుండి
యకట! బంగారుసాలభం ♦ జికలు నేఁడు
హీనుఁ డగుబాలకునిచేతి ♦ లోనఁ జిక్కి
విడుచునో? యతండు బల్మిని ♦ విఱుచునో గద!

ఇప్పఁ డేమిచేయుటకును దోఁచ కున్నది. శత్రుకుతంత్రవార్త
లును మహారాజక్షేమసమాచారమును సాంతముగాఁ గనుఁ
గొని రమ్మని నిపుణమతి యగుకొండనాయకునిం బంపితిని గదా!
అతఁడును నాలసించుచున్నాఁడు. (ఆలోచించి) --

ఉ. భద్రముఖాదిభృత్యు లొక ♦ పాటిని బోయెడువారె? వార ల
క్షుద్రమతిప్రభావమున ♦ సూర్యుని తేజముఁ గప్పి రాత్రిగా
నిద్రకు శత్రులన్ మొగిపి ♦ నేర్పునఁ దా మొనరించుకార్యముల్
ఛిద్రముగాకయుండఁ దుదిఁ ♦ జేర్చి నటింతురు చిత్రపద్ధతిన్.



జగ్గరాయఁడుమాత్రము సామాన్యుఁడా?

గీ. అల్పమతి యని జగ్గరా ♦ యని దలంప
రాదు చిరకాలపరిచిత ♦ రాజ్యతంత్ర
పటలఘటితస్వతంత్రగ ♦ ర్వప్రధానుఁ
డాతఁ డింతలంతలఁ బోవు ♦ నట్టివాఁడె?

అకటా! హృదయము సంశయగ్రస్తమై సర్పముచేఁ జుట్టికొనఁ
బడిన నరునిగతి సంకట పడుచున్నయది. ఇట్టి మహాయత్నము
న మునింగియున్న నాకుఁ దుదకు—

దౌవా—(ప్రవేశించి) జయము కలుగుఁ గాక!

యాచ—మహారాజు కంటఁ బడునా?—

దౌవా—వైరిబలములతో నశించును గాక.

యాచ—(అదరిపడి తనలో) ఇది యేమి? నావాక్యములతో నీదౌ
వారికునివాక్యములు సమన్వయించుకొన్నచో "నిట్టిమహాయ
త్నమున మునింగియున్న నాకుఁ దుదకుజయము కలుగు" నని
తోఁచెడు. "మహారాజు కంటఁబడునా" అనునపుడు "వైరిబల
ములతో నశించును గాక" అని వినఁబడుటచే సగము శుభ
మును సగ మశుభమును స్ఫురించుచున్నది. మొదటివాక్యము
నందైనను "తుదకు" అని నానాలుకనుండి వెడలు నంతకు
"జయము కలుగును గాక" అని వినఁబడుటచేఁ గూడ మధ్య
నంతరాయములును వానివెంటఁ గడగండ్లును, గడపట కార్య
సిద్ధియుఁ గలుగునట్లు తోఁచుచున్నది. ఏ మైన నేమి సేయఁగ
లము? అన్నిటికిని దైవమే మూలము గదా! (ప్రకాశముగ)
దౌవారికా! ఏమో చెప్పఁదలఁచి వచ్చితివి?

దౌవా—ప్రభూ! కొండనాయకుఁడు తమదర్శనమును గోరుచున్నాఁడు.

యాచ—కొండనాయకుఁడు వచ్చినాఁడా! అట్లయిన శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

దౌవా—చిత్తము. (అని నిష్క్రమించును.)

కొండ—(ప్రవేశించి) రాజా! జయము! జయము!

యాచ—కొండనాయకా! ఇందుఁ గూర్చుండుము.

కొండ—(అట్లు చేయుచున్నాఁడు.)

యాచ—మహారాజు కుటుంబముతోఁగూడ క్షేమముగ నున్నాఁడు గద!

కొండ—ఇప్పటికి దేవర సెలవిచ్చినట్లే.

యాచ—ఏ మట్లనుచుంటివి? దురాత్ముఁ డగుజగ్గరాజహతకుండు మఱల నెట్టిదుర్మార్గమును జేయలేదు కద!

కొండ—ఆగొడవ యెక్కుడుగ నున్నది. చంద్రగిరి యిప్పు డల్లకల్లోలముగా నున్నది.

యాచ—శత్రులు మనభేదోపాయము లెఱింగిరా యేమి? రజకుఁడు కుమారరంగరాజమణి నిటకుఁ దీసికొనివచ్చినదిమొదలు జగ్గరాజాదు లచట నెట్లు ప్రవర్తించిరి?

కొండ—దేవా! కారాగారమును గొంతకాలము వీరనారాయణుఁడును గొంతకాలము జగ్గరాయనికుమారుం డగుకోబలరాయండును రక్షించుచుండి రనుట దేవర యెఱింగినదియే కదా?

యాచ—అవును.

కొండ—ఓబలరాయనిరక్షణసమయమున మీచే మహారాజున కంపఁబడిన లేఖ ప్రమాదవశమునఁ గారాగారపుటినుపయూఁచలగుండ నీవలఁబడి గాలిచేఁ గొట్టుకొనుచు నోబలరాయనికి దృగ్గోచరమయ్యెను.

యాచ—అకటా! ప్రమాదము సంభవించెనే?



కొండ—ఆదురాత్ముఁ డదిగైకొని సంగతినామూలము గ్రహించి మండిపడి దానిం దండ్రి కెఱింగించెను. జగ్గరాయండు లయకాలకాలానలునిపోల్కి బంధనశాలకడ కరుదెంచి రంగరాయకుమారుం డందులేమి కది ప్రబలనిదర్శనంబుగాఁ జూచికొని తత్క్షణము రజకుని రప్పించి రాజద్రోహాపరాధమునకై వానికరశిరఃకర్తనంబుఁ గావింపించెను.

యాచ—అక్కటా! పాప మారజకుఁ డుపకారమునకుఁ బోయిన నపకార మయ్యెను. పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర మనినట్లాతనిమీఁద నా తనయాజ్ఞాబలము? దైవమా! నీ వెంతటినిర్దయస్వాంతముతో నుంటివి? సన్మార్గుల కేల కష్టపాటును దెచ్చి పెట్టుచుందువు? ఏమి యీప్రపంచకస్వభావము!

గీ. పుడమి మంచివారికె కష్ట ♦ ములు ఘటిల్లు
మంచివాసన వెదఁజల్లు ♦ మల్లెపూలు
పాన్పులను బడి నలుగుచుఁ ♦ బడుటఁ గనమె?
చెఱకుఁ గనుఁగొనమే పిప్పి ♦ చేయఁబడుట?

ఓ ప్రభుభక్తుఁడా! రాజకార్యధౌరంధర్యమునఁ గృతార్థుఁడవై స్వామిపాదపద్మోపజీవుఁడ వని వన్నె కెక్కిననీకుఁ దుద కీరాజవిద్రోహ మనునపరాధమిషమునఁ బ్రాణములు విడువవలసి వచ్చెనా?

కొండ—అట్లుపిమ్మట నీయకార్యము వీరనారాయణునివలనఁగూడఁ గొంత జరిగియుండునని సంశయించి జగ్గరాయఁ డాతని సతనిబలములతో నాయుద్యోగమునుండి తీసివైచెను.

యాచ—అకటా! ఎంతటి పని జరిగెను. ఓలేఖా! సత్కార్యమునకు మూలమైననీవు, మందు వికటించి రోగులకు విషమైనయట్లు,

వక్రపథగామివై రాజభక్తులకు స్వామిహితచిత్తులకు మహాప
కారిణి వైతివా? చెలికాఁడా! వీరనారాయణా! నీకు మొదట
నే తెలిపితిని గాదా! అయిన దీన నీనేర మే మున్నది? ఇది
యంతయు దైవవిధి.

కొండ—జగ్గరా జంతటితో నూరకుండక మహారాజును కుటుంబ
సహితముగా నాబంధనశాలనుండి తప్పించి మఱియొకరహస్యా
గారమున నుంచి కఠినముగఁ గాఁపుండ దిట్టరులగువారి నందు
నియోగించెను.

యాచ—హా! మహారాజా! సుకుమారుఁడ వగునీ కీపాటు తగనిది.
అట్టిదానిని పాడువిధాత లిఖించెను గదా! నీయవస్థ గుర్తెఱింగి
యున్న నేను తుల్యావస్థనే యనుభవించుచున్నాఁడను.

ఆ. వె. అనుపయోగమైన ♦ యట్టి యీదేహంబు
బంధగేహమయ్యెఁ ♦ బ్రాణములకు
విపులదుఃఖశత్రు ♦ వితతిఘూర్ణములఁ
జిక్కి తెప్పఁ గనక ♦ స్రుక్కవలసె.

కొండ—మహాప్రభూ! విచారించినఁ బ్రయోజన మేమి? కడమవి
నుఁడు.

యాచ—వినుచునే యున్నాఁడను. నాకు విచారమే లేదు. కానిమ్ము.
వినయంధరుఁ డేమి చేసెను? ఆతనిజాడ శత్రువులకుఁ దెలియ
లేదు కద!

కొండ—తెలియ కుండునా? మక్షికములకుఁ బుండును వెదకుటయే
స్వభావము కదా! ఆతని బ్రత్యక్షముగ వా రేమియుఁ జేయ
లేదు. కాని యాతనిని రహస్యముగ శత్రువులు దానుమూల
ముగఁ గడతేర్చి రనియొక ప్రవాదము లోకమునఁ బ్రాఁకినది.



యాచ—(విచారముతో) దైవ మిన్నివిధముల నొక్కయీనరమా
త్రుని గ్రుంగఁజేయుచుండ నింకఁ జేయవలసిన దే మున్నది?

గీ. రజకుఁ డర్పించె నసువులు ♦ రాజభక్తి
కకట! వీరనారాయణుం ♦ డవశుఁ డయ్యెఁ
బాపభూయిష్ఠమని యీప్ర ♦ పంచకమును
రోసి వినయంధరుఁడు మమ్ముఁ ♦ బాసి చనియె.

హా! ఆర్యవినయంధరా!

గీ. నాఁడు వీరవేంకటమహీ ♦ నాయకుండు
ప్రీతిమెయి నీకు నాకు నొ ♦ ప్పించెఁ గాదె
చిక్కవిభు; నాతనిని నన్ను ♦ నక్కటకట!
యెవ్వనికి నొప్పగించి పో ♦ యితి మహాత్మ!

చ. ఇరువురముఁ సమానగతి ♦ నీఘనకార్యభరంబుఁ దాల్చి యే
కరణినొ కార్యసిద్ధిఁ గనఁ ♦ గాఁ దలపోసితి మంతెకాని, మ
త్సరమున నిన్నుఁ బాపుటకు ♦ దైవము చూచు నటంచు, మిత్తి తీ
వరమున నిన్ను మ్రింగికొన ♦ వచ్చు నటంచు నెఱుంగ మిత్త్రమా!

విచారించి కార్య మేమి? కొండనాయకా! భద్రముఖాదులు
మనయనుచరులు మహారాజును బంధనశాలనుండి తప్పింపఁ
బూని యట కరుదెంచిరి కదా! వా రేమియుఁ జేయలేదా?

కొండ—మహాప్రభూ! చేయు కేమి? సర్వమును గావించిరి.

యాచ—(సంతోషముతో) కృతార్థు లైరా?

కొండ—దైవలోపమువలన నందెడుఫల మనుభవమునకు వచ్చినది
కాదు.

యాచ—అందునకు వా రేమి చేయుదురు? పోనిమ్ము. వార లేమార్గ
మునఁ దమకార్యమును సాధించుకొనఁ బూనిరో?

కొండ—ప్రభువునుమతి వడసి, భద్రముఖ, ప్రియముఖ, విశాఖ, సారణ, లోహితాస్య, చండదాస, కుండలక, కందకులనమంద్రుడను బ్రచ్ఛన్నగతిఁ జంద్రగిరిఁ బ్రవేశించి తామిట్టివార మని యొరు లెఱుంగకుండ సంచరించుచుఁ గారాగృహాధిపతిదయకుఁ బాత్రులై యాతని కనుచరులై వానియొద్ద నుద్యోగముల సంపాదించి సేవింపసాగిరి.

యాచ—సెబాస్! తరువాత!

కొండ—అనంతర మాయేనమండ్రును దమనియమితకృత్యముల నేమఱక నెఱవేర్చుచు నిశాసమయంబున నొరు లెఱుంగనియొక యటవీప్రదేశమునుండి సొరంగ మొకదానిని స్వామికారాగృహముక్రిందికిం ద్రవ్విరి.

యాచ—(సంతోషముతో) మేలు! మేలు! తరువాత నేమైనది?

కొండ—తదుపరి భద్రముఖుండు తగురీతి మహారాజచిక్కరాయనికిం దన్నుం గానిపించుకొని దేవరసందేశ మామూలచూడముగ విన్నవింపఁ బ్రభు వానందమగ్నుఁడై మిమ్ము బహువిధంబులం గొనియాడి యారాత్రిన ప్రయాణ మగుదుమని యానతిచ్చిరి.

యాచ—తరువాత! తరువాత!

కొండ—ఇట్లుండ నారాత్రి జగ్గరాయఁడు ప్రచ్ఛన్నముగ శత్రువుల జాడలం గనుఁగొనుటకై యశ్వారూఢుండై పోవునపుడు శృంగాటకంబుదరి గూఢమార్గోపరిభాగంబు దైవికంబుగాఁ గూలఁబడెను.

యాచ—అయ్యో! మనమనోరథము భగ్నమైనది. తరువాత?

కొండ—పిమ్మట నాతఁ డాయగాధమార్గముం గని యాశ్చర్యపడి కొండఱిసేవకులం గొని కరదీపికాసహాయమున నది పోవుమార్గమున



నడచి పోయెను. ఆసొరంగము తిన్నఁగ వారిని మహారాజున్న కారాగృహముక్రిందికిం దీసికొని పోయెను. ఆసమయముననే పాపము! మహారాజు సకుటుంబముగా నాబిలముఖద్వారము దిగి వచ్చుచు జగ్గరాయనిచేతఁ బట్టువడియెను.

యాచ—అక్కటా! ఏమి దైవమాయ? కొండవలె వచ్చి మబ్బువలె మాయమై పోవుచున్నది. తరువాత నేమి జరిగినది?

కొండ—దేవా! అటువెనుక జగ్గరాయుండు మహారాజును సకుటుంబముగ నీవలికి రప్పించి తొంటికంటెఁ గఠిన మగురీతి నొకవివిక్తగృహములో నుంపించెను.

యాచ—భద్రముఖాదు లేమైరి?

కొండ—జగ్గరాయనికిఁ దమరహస్యము వెల్లడియయ్యె నని వారు తెల్లవారకమునుపె యెందో పోయిరి.

యాచ—

చ. మనమొనరించుయత్నములు ♦ మాయము చేయుచునుండె జగ్గరా
జనయము; చిక్కరాజవిభుఁ ♦ డక్కట! దిక్కఱి యిట్టికష్టపా
టునకు నిదానమై మదిఁ గ ♦ డుఃఖమున మూరకయుంటిమంచు నే
మనుకొనునోగదా తెలియ ♦ దయ్యె నహా! విధి! యేమి సేయుదున్.

ఓకాలమా! ఇంతయు నీప్రభావమే— నిన్నన నేల? తుచ్ఛులగు నాజగ్గరాజాదుల ననవలయుఁ గాక! ఓరోరి! జగ్గరాజహతకా!

చ. కొలమున గొప్పవానిని న ♦ కుంఠితతేజుని నీకు రాజుగా
వెలసినవాని, ధర్మమతి ♦ వీడి, పదచ్యుతుఁ జేసి దానితోఁ
దొలఁగక, కారలోన నిడి ♦ తుచ్ఛ సవంశ్యుని రాచగద్దెపై
నిలిపిననీయకృత్య మన ♦ నిన్ నిపుఁ బామయి చంపకుండునే!

చ. అది యెట్టులైన మామకమ ♦ హాశనిసన్నిభభీమఖడ్గ మ
భ్యుదయముఁ జెందిచెంది జగ ♦ దున్నతపాతకి వైననిన్ను బె
ట్టిదముగ జన్యధాత్రిఁబ్రక ♦ టీకృతసమ్మదతాండవంబులన్
బొదివి త్వదీయమస్తకము ♦ భోరనఁ ద్రుంపకపోవ నిచ్చునే!

కొండనాయకా! మహారాజు నిట్టియవస్థం జూచుచు మన మూరకుండవలసినదా? వీరనారాయణుం డట్లు సబలంబుగఁ దోలఁగింపఁబడి యే మయ్యెను? అతఁడు రాజభక్తికి మొదటికందము. విశేషించి యస్మత్ప్రాణమిత్రుండు. వీరకృత్యంబున నాకుం దీటగువాఁడు. శత్రువులగర్వవిచ్ఛేదము చేయక యెక్కడనైన నడఁగియుండువాఁడు కాఁడు. ఏమి చేసెను? చెప్పుము!

కొండ—యాచశూరేంద్రా! ఏమి చేయుట యేమి? చంద్రగిరికోటనే స్వాధీనము చేసికొనియెను.

యాచ—(ఆనందముతో) ఏమేమి? చెలికాఁడు వీరనారాయణుఁడు చంద్రగిరిదుర్గమును సాధించెనా! ఎట్లు?

కొండ—కొండవీటిదుర్గాధ్యక్షుం డగుతిమ్మరాజభూపాలుని నీతిబాహుళ్యమున—

యాచ—ఆశ్చర్య మాశ్చర్యము! ఇంతదనుక నుభయపక్షములకును దటస్థుఁడై యున్నయాతఁ డిప్పుడు మనకు సహాయము చేయుటఁ జూడ దైవము మనయెడ నున్నట్లే తలంచుచున్నాఁడను.

కొండ—తిమ్మరాజప్రభుండు జగ్గరాజునకు "మీతోఁ గొన్ని రాజకార్యవిషయములు ముచ్చటింపవలసి యున్నది. మమ్ము మాధ్యదుర్గమునఁ గలిసికొనఁ గోరెదము." అని వార్తనంపి వీరనారాయణునకు "జగ్గరాజు పురమువిడిచి యరిగినపిదపఁ జంద్రగిరిదుర్గము నాక్రమించుకొని యావార్త యాచశూరునకుఁ దెలుపుము." అని యొకలేఖఁగూడ వ్రాసెను.



యాచ—జగ్గరాయలు తిమ్మరాజును దర్శింపఁ బోయెనా?

కొండ—ఆహా! ఇదివఱ కుభయపక్షములం జేరనియారా జిప్పుడు తనకు సహాయుఁడుగా రాఁబోవుచున్నాఁ డని యోచించి జగ్గరాజాతని నెదుర్కొన నిజపరివారముతో నాఁడే పయనమై పోయెను. ఇంతలో వీరనారాయణుఁడు చంద్రగిరిదుర్గము మూడుద్వారములు స్వాధీనముఁ జేసికొనియెను.

యాచ—తరువాత!

కొండ—అంతకు మునుపె తిమ్మరాజునొద్దనుండి దేవరకు వార్తఁ దీసికొన వచ్చుచున్న వార్తాహారి త్రోవలో జగ్గరాజహతకునిచేఁ బట్టువడుటచే రహస్యము వెల్లడికాఁగా తిమ్మరాజుమోసకృత్యమునకుఁ గినియుచు జగ్గరాజు గిఱుక్కున మళ్లి చంద్రగిరి ప్రవేశించి వీరనారాయణునిచే నాక్రమింపఁబడకుండనున్న కోటనాలవద్వారముగుండ లోపలఁ బ్రవేశించి తనమహాసేనతో వీరనారాయణుని, ఆతనియేనూర్గురుభటులను నిర్దయుఁడై నిలువున నరికించి వైచెను.

యాచ—అబ్బా! ఎంతకష్ట మెంతకష్టము! నేను వినఁ జాలను. నేను వినఁ జాలను. హా! మిత్రమా! వీరశిఖామణీ!

ఉ. ఇంచుక యంత తక్కువగ ♦ నెల్లజయంబును గాంచి నన్ను నా
సించియు మత్సహాయమును ♦ జెందుటఁ గానక శత్రువాహినిన్
గొంచెపుసేనతో మునిఁగి ♦ కొట్టుకపోయితి వయ్య! దైవ మీ
వంచన సేయ నన్ గలియు ♦ వాంఛలతోడుతఁ బ్రాణమిత్రమా.

హా! వీరనారాయణా!

ఆ. వె. నిన్నువంటిశూరు ♦ నినువంటివీరుని
నిన్నువంటిధైర్య ♦ నీరనిధిని

నిన్నువంటిసఖుని ♦ నే నెన్నిభవముల
నైనఁ బొందఁగందు ♦ నయ్యొ! యింక.

అయ్యో! మిత్రమా! నేనుగూడ నీతో రావలదా!— ఏమి నావెఱ్ఱి?

గీ. రాజభక్తికిఁ దమప్రాణ ♦ రాజి నొసఁగి
యవని శాశ్వతకీర్తియు ♦ దివి నమేయ
సౌఖ్యమును బొందుననఘుల ♦ స్వామిహితము
సేయనేరనినే నెట్లు ♦ చేరువాఁడ.

కొండ—రాజా! విచారించి యేమి చేయఁగలము?

యాచ—విచారమే లేదు. నాగుండె వజ్రకఠినమైనది. కనుకనే యిందఱిపాటును వినియు నీరు గాకున్నది. అయ్యో! నీవు వచ్చినప్పుడు మహారాజును జూచుట తటస్థమైనదా?

కొండ—చూచుటయే కాదు. భాషించికూడ వచ్చితిని.

యాచ—అట్టియవస్థలో నున్నప్రభు వేమనియెను?

కొండ—వినుం డారాజువాక్యములు.

"వీరశిఖామణీ! యాచశూరా! నీవంశమువారందఱును కర్ణాటరాజ్యలక్ష్మి నింతదనుక నేయపాయమును బొరయకుండఁ గాపాడిరి. నీవును బూర్వాచారమును విడువక రాజభక్తిని బ్రకటించుచునే యున్నాఁడవు. ఇప్పట్టున దైవము మన కనుకూలముగా నుండినట్లు లేదు. వృథాప్రాణహింస యేల? నాస్థితికై నేను విచారించుట లేదు. చేయి విడిచిపోయినసిరికై ప్రాజ్ఞుఁడు వగవఁడు. ఇఁక నాకై విచారించుట మాని కుమారశ్రీరంగరాయని యీప్రభువును రాజ్యలక్ష్మితోఁ గూర్చి యశం బందుము."



యాచ—హా! మహారాజా! ఎంతమాట యాడితివి? ఈయాచశూరుఁడు కంఠమునఁ బ్రాణ మున్నంతవఱకు, అట్టియమంగళములను వినునా? వినఁడు. వినఁడు.

(తెరలో)

తప్పదు. తప్పదు.

యాచ—(అదరిపడి) ఏమిటీ యీయపశకునవాక్యము లెవ్వరివి? ఎవరక్కడ?

దావా—(ప్రవేశించి) మహాప్రభూ! ఏమి సెలవు?

యాచ—ఆపలుకున దెవ్వరు?

దావా—దేవరసోదరులు రాయభూపాగ్రణియు దండనాయకులును యుద్ధము తప్పదు తప్పదని ముచ్చటించుకొనుచుఁ గొలువుకూటమున కేగుచున్నారు.

యాచ—ఓహో! రాయపతి వచ్చెనా? అట్లయిన మేమును నేతద్విషయికాలోచనలకై యరుగవలయును. కొండనాయకా! మన ప్రయత్నములు మనము చేసితిమి. ఇఁక సమరముకంటె వేఱె యుపాయము లేదు. అందు మహారాజరక్షణము మనకు ముఖ్యకార్యమై యున్నది.

కొండ—అయ్యో! "జగ్గరాయఁడు దురాత్ముఁడు. ఏవేళ కేమి తలపెట్టునో" యని చంద్రగిరిప్రజలు మహారాజుపై వేయికన్నులు పెట్టుకొని చూచుచున్నారు. ఇఁక మనము త్వరపడవలయును.

యాచ—అట్లే యోచింతము. రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## పంచమాంకము.

### రంగము—కారాగృహము.

(చిక్కరాయలు, రాణి, తిరుమలేంద్రుఁడు, నిద్రించుచున్న వీరాంబ, రామరాయలు, కనకాంబ ప్రవేశించుచున్నారు.)

చిక్క—(నిట్టూర్పు పుచ్చి) హా! దైవమా! ఇక్లెంత కాలము గడపెదవు?

సీ. కులహీనులకు రాజ్య ♦ ము లొసంగి సత్కులీ
నులచేతఁ గొలిపించి ♦ యలరఁ గలవు
నవ్వించి యేడ్పించి ♦ నలుగుడులం బెట్టి
జీవుల నట్టిట్టు ♦ చేయఁ గలవు
అఖిల వైభవముల ♦ నంతలోఁ ద్రుంగించి
ఘనుల నల్పులఁ జేసి ♦ తనరఁ గలవు



ఒకనిరాజ్యంబు వే ♦ ఱొకనిపా లొనరించి
కుందించి చూచుచుఁ ♦ గులుకఁ గలవు
గీ. గడియ కొక్కొక్కత్రోవఁ ద్రొ ♦ క్కంగఁ గలవు
నిముసమున కొక్కరీతిగా ♦ నెగడఁ గలవు
దైవమా! యెన్ని గతులనో ♦ పోవఁ గలవు
కాని యొక్కప్పుడైనను ♦ గానఁ బడవు.

గుణాతీతుండవు నవాఙ్మానసగోచరుండవు నగు నిన్నూరక తూలనాడుటవలన ఫల మేమి? ఇది యంతయును స్వయంకృతాపరాధము.

గీ. గ్రంథరాజంబుఁ గైకొని ♦ కవిని ద్రోయు
నట్లు దుర్గాధికారంబు ♦ నపహరించి
దండనాథుఁ ద్రోసిననృపా ♦ ధముఁడ నాకు
నిట్టిగతి గల్గకుండునే ♦ తుట్టతుదకు?

రాణి—ప్రాణేశ్వరా! మీ రట్లు విచారింపకుఁడు. కాలము తప్పివచ్చి నప్పుడు మన మేమి చేయఁగలము?

ఉ. ఒక్కపు డాగ్రహంబు మఱి ♦ యొక్కపు డెంతొ యనుగ్రహంబు వే
ఱొక్కపు డల్లరెంటఁ గను ♦ చుందురు భూపతు, లప్డు సేవకుల్
మిక్కిలి నమ్రులై నృపతి ♦ మెచ్చుకొనన్ జరియింతు రంతె కా
కొక్కటఁ గూలఁ ద్రోయుటకు ♦ నోర్వఁగఁ జాలుదురే కృతఘ్నులై.

హేమగారియనుగ్రహమువలన నేశ్రమయు లేకుండ నింతకాలము గడపితిమి. మన కేమి? సగము కాలము చెల్లినది. కాని, నేఁడో ఱేపో యువరాజ్యపట్టాభిషేకమునకు సిద్ధముగ నున్న యీచిన్నికొమరుని, ఆగర్భశ్రీమంతురాలై కష్టము లెన్నఁడు నెఱుంగనిసుకుమారి యగునీముద్దుకోడలిని నోరెఱుంగని యీ

చిన్నిబిడ్డలను నిట్టియవస్థలోఁ జూచుచున్న నాకడుపు తరుఁగుకొని పోవుచున్నది. ఏమి చేయఁగలము?

తిరు—తల్లీ! క్షత్రియకుమారుండ నయ్యుఁ దల్లిదండ్రుల నిట్టియవస్థం గాంచుచు నేమియుం జేయనేరనివ్యర్థుఁడనై యున్ననాకై యేల విచారించెదరు?

చిక్క—కుమారా! ఎంత వెఱ్ఱివాఁడవు? విధికృత మవిలంఘ్యము గదా!

చ. బలమును విక్రమంబును సు ♦ పాయము సాయముఁ గల్గి యెందునుం
జలన మొకింత లేక శుభ ♦ సంగతి నొప్పుచు నున్న దైవదు
ర్బలత యొకింత కల్గఁగనె ♦ వాఁడు తృణంబునకంటె నెంతయుం
జులకన యౌట తప్పదిది ♦ సుమ్ము నిజ మ్మిది నమ్ము పుత్త్రకా!

రాణి—ప్రాణనాథా! సకుటుంబముగ మన కీకారాగృహనివాసముం గూర్చుటకు దైవమునకు మన మేమిమహాపకారముం జేసితిమి?

చిక్క—దేవీ! జీవులకు వారివారిపూర్వకర్మఫలంబు లొసంగుటయే కాని సర్వసముం డగుభగవంతున కీర్ష్యాసూయాదిగుణంబు లుండునా?

తిరు—నాయనగారు! అట్లనియెద రేల?

గీ. ఊరుఁ బేరును దెలియని ♦ యొక్క పడఁతి
కొడుకునకు రాజ్యపట్టంబుఁ ♦ గూర్చినట్టి
పాపిదైవంబునకుఁ జల ♦ పాదితనము
కాక మన కిట్టిగతిఁ గూర్చి ♦ కలఁప నేల?

మన కీకారాగృహవాసదుఃఖమునకంటెఁ జిరకాలమునుండి సుక్షత్త్రియవీరులచేఁ బరిపాలింపఁబడుచున్న యీరాజ్యసింహాసనము కులశీలము లెఱుంగని యొకనీచునిసంస్పర్శనంబునఁ గళం



కిత మగుచున్న దనువిచారము వేయిమడంగులై హృదయమును వేధించుచున్నది.

చిక్క— ఇట్టి వ్యర్థుల మగుమన మెంతచింతించిన నేమి లాభము?

సీ. మనతండ్రితాత లె ♦ వ్వనితండ్రితాతల
సామర్థ్యమున సార్వ ♦ భౌము లైరి
మనకుటుంబున కె ♦ వ్వనిసత్సహాయత
శ్రీరామరక్ష యై ♦ చెలఁగుచుండు
మనశత్రువులకు నె ♦ వ్వనిగుణశ్రవణంబు
వాకట్టుమంత్ర మై ♦ వఱలుచుండు
మనమోక్షణమున కె ♦ వ్వనివిభేదోపాయ
మతినిబిడంబుగా ♦ నలరుచుండు

గీ. అట్టి సత్పురుషుండు ద ♦ యామయుండు
విశ్రుతపరాక్రముండు ధీ ♦ విభవశాలి
హితుఁడు వెలుగోటి యాచశూ ♦ రేంద్రుఁ డిట్టి
కొదువ రానీఁడు చింతింప ♦ కుము కుమార!

రాణి—హా! కుమారా! శ్రీరంగరాయా! అనవరతసామంతసేవాసమంచితవైభవుండును, అనాథజనసంరక్షణదీక్షాదక్షుండును నగు సార్వభౌమునికడుపునం బుట్టిననీకు మఱియొక్కని సంరక్షణమున నుండవలసి వచ్చెను గదా!

చ. అకట! సమగ్రవైభవస ♦ మంచితుఁ డైతగుతాతపేరు మో
చికొని చరించునీకును బ్ర ♦ సిద్ధజయంబును భాగ్యముం విధా
యకముగఁ గల్గునంచుఁ గను ♦ నాసల నుంటిమి గాని దారి తోఁ
పక నిను వీడఁగావలసి ♦ వచ్చె నెఱుంగమురా కుమారకా!

నాయనా! నీ కీపంద్రెండేఁడులప్రాయముననే యెన్నెన్నికష్టములు ప్రాప్తించినవి?

చ. రజకునిబట్టలంత దిఱికి ♦ రాజకుమారుని నిన్ను గూఢవ
రజునివిధంబునన్ మదిని ♦ గ్రాఁగుచు రెండవకంటివారెఱుం
గఁజననిమార్గమున్ దనుపఁ ♦ గావలసెన్ బెగడొంది యెంతగా
గజిబిజియైతివో తనయ! ♦ కట్టఁడులన్ మము నెంతదూఱితో!

తిరు—అమ్మా! తమ్మునికొఱకు విచారింపకుము. ఆతఁడే కృతార్థుఁడు. ఆతనిపోకడ రాజ్యపునరుద్ధరణంబునకు మూలకారణంబు గదా! మనయాచశూరునిరక్షణంబున నుండుటచే తమ్ముఁడెల్లవిధంబుల క్షేమముం గని యుండును. ఆతని కొఱులసంరక్షణంబున నుండవలసివచ్చె నని విచారింపకుము. ఏమి మనకు యాచశూరుఁడు లాఁతివాఁడా?

చ. ఎఱుఁగవె పాండునందనుల ♦ నేవుర? నామహనీయకీర్తు లెం
దఱితనుజాతులం గనిరి ♦ తల్లి! కులంబు జగంబునందుఁ బొ
ల్పఱె చెడకుండ నిల్పెను మ ♦ హాత్ముకుఁ డందుఁ బరీక్షితుం డనన్
బరఁగెను గాని యెంతటిస ♦ మర్థులు సట్టియశంబుఁ గాంచిరే?

రాణి—హరిహరీ! కుమారా! అమంగళము లాడకుము?

చిక్క—కటకటా! నే నెంతటిహీనచరిత్రుఁడను? నాజన్మము నావంశమున కంతకును గళంకముఁ గూర్చుచుండ నేమియుం జేతగానివాఁడనై చూచుచు జీవించి యుంటిని!

సీ. పెదతాత రామరా ♦ డ్విభుఁ డాంధ్రగీర్వాణ
కృతులు పెక్కులు గాంచి ♦ కీర్తి వడసెఁ
తాత యాతిరుమలేం ♦ ద్రక్ష్మావిభుఁడు వను
చరితంబుఁ గొని శుభ ♦ చరితుఁ డయ్యె
అయ్య శ్రీరంగరా ♦ యలు కృతార్థుం డయ్యె
సరసలక్ష్మీవిలా ♦ సకృతివలన



పినతండ్రి యగువీర ♦ వేంకటపతి కవీ
శ్వరులను బోషించి ♦ ప్రతిభఁ గాంచె
గీ. సట్టివారలవంశమం ♦ దవతరించి
నేను నారాజ్య మొకకుల ♦ హీనుఁ డనుభ
వించుచును గవిగాయకుల్ ♦ వినుతి సేయ
నుబ్బుచుండంగఁ జూడఁగా ♦ నుంటి నకట!

హా! తల్లీ! బాయమాంబా! చిన్నతనమునుండియు నాతలిదండ్రుల నెఱుంగక నిన్నే తల్లిగను నాపినతండ్రి యగునీభర్తనే తండ్రిగను నమ్మి మీయెడ భయభక్తులతోఁ బ్రవర్తించితిని గదా! ఈరాజ్యము నాకుఁ జెందించుటకు నీ కిష్టము లేకున్న నొకనుక్షత్రియకుమారునిం దెచ్చి పెంచికొన రాదా? ఎవ్వరో కనినబిడ్డం దెచ్చి నేనే కంటి నని ప్రకటించి యిట్టి జనవిరుద్ధకార్యాచరణంబుం బూన నేల? అట్లు గాకున్న నీకుటుంబకలహంబును గులకళంకంబును గలుగదు గదా! హా! పితృవ్యా! నీవు క్షత్రియునకుం దగినపనియే చేసితివి. ఇంతకంటె నీ వేమి చేయఁగలవు? ఒక్కొక్క కాంతమూలమునఁ జన్నవారికిని నివుడున్నవారికిని నిఁక ముందు పుట్టఁబోవువారికిని నెంతెంతయప్రతిష్ఠలు కలుగుచున్నవి? హా! కాంత లెంతటి సాహసమునకైనం దగుదురు.

సీ. కనుసన్నల మెలంగ ♦ నొనరించి మగని న
మ్మినబంటుగాఁ జేసి ♦ కొనఁగఁ గలరు
కులశీలముల లెక్క ♦ గొనక కోరినకోర్కె
తెగి యెట్టులైన సా ♦ ధింపఁ గలరు
ఎట్టియసత్యంబు ♦ నేని సత్యంబుగా
మెఱయించి జనుల న ♦ మ్మింపఁ గలరు

బలమైనయపవాద ♦ ములకైనఁ దల యొగ్గి
వెఱపింత లేక జీ ♦ వింపఁ గలరు
గీ. బోఁడితలకు మోకాలికి ♦ ముళ్లు వెట్టఁ
గలరు, తల మార్చి తల నిట్టి ♦ నిలుపఁ గలరు
మిన్నునకు మన్నునకుఁ ద్రాడు ♦ బన్నఁ గలరు
కామితుల్ కలికాలరా ♦ కుసులు గారె!

హా! కాలము మారినకొలంది జనులబుద్ధు లెట్లు పాడగుచున్నవి?

ఉ. అక్కట! యొక్కగూఢజుని ♦ నౌరసుఁ డంచును దెచ్చి పెంచి తా
నొక్కటఁ గూలఁ ద్రోయుటకు ♦ నోర్చెను సత్కులమెల్ల రాణి వే
రుక్కున జగ్గరాజును న ♦ యోగ్యతకుం గుమారైనపుత్త్రిప
ల్కక్కఱఁ జేసి యిట్లు వెల ♦ యంగ నొడంబడె దుర్విదగ్ధుఁడై.

తిరు—(కోపముతో) నాయనగారు! పౌరుషవిహీనుం డగునాపలువ పేరు తలపెట్టకుఁడు.

రాణి—కులదూషకుం డగునాతనివలన నేకదా మన కిట్టిపాటు వాటిల్లినది? జంత్రపుబొమ్మవలె నెట్లాడించిన నట్లాడుచు నేమిటికిం గర్త గాక కులహీనుండును గుణహీనుండునై యున్నకుమారచిక్కని నే మన్న నేమి? కటకటా! తుట్టతుదకు. సార్వభౌమవంశ మెంతటిగతికి వచ్చినది?

తిరు—(ముందుఁ జూచి)

చ. కటకట! దిక్కుమాలినబి ♦ కాపులకైవడి రాతినేల దు
ప్పటమును లేక కప్పికొను ♦ బట్టయు లేక పరుండి, మేను నొ
చ్చ కుఱుఁగకుండ నిద్రఁ గను ♦ సోదరులం దెరలెత్తుదుఃఖ మొ
క్కట దిగమ్రింగి చూచికొనఁ ♦ గావలసెన్ విధిప్రేరణంబునన్



కన—(నిద్రనుండి లేచి యన్న యగురామరాయనిం దట్టుచు) అన్నయ్యా! లెమ్ము. అదిగో నగారా కొట్టుచున్నారు.

రామ—(అదరిపడి లేచి) చెల్లెలా! ఏనుఁగు నెక్కి చిన్నన్నగారు వచ్చుచున్నారా? అమ్మతోఁ జెప్పుదము రమ్ము. (అని యిరువురుఁ దల్లియొద్దకుఁ బోఁబోవుచున్నారు.)

వీరాం—(లేచి యడ్డగించుకొని) అబ్బాయీ! మీయన్న వచ్చుట లేదు. ఇప్పుడు తెల్లవాఱుచున్నది. కోటలో భేరి మ్రోగించుచున్నారు. కొంచె మాఁగుము.

రామ—మాయన్న కోటలో నున్నాఁడా?

వీరాం—(తనలో) ఈపసిబాలునియావేగముం జూడ నాకే కడుపు చెఱువైపోవుచుండఁగాఁ గన్నవారి కెట్లుండునో యనుభవైకవేద్యమే కదా! కట్టా! ఈచిట్టికూనకే నేమియుత్తరము చెప్పుదును? (అని కన్నీరు నించుచున్నది)

రామ—వదినె మాటాడ దేమి? (తల్లియొద్ద కేగి) అమ్మా! చిన్నన్న కోటలో నున్నాఁడా?

రాణి—(బిడ్డల నెత్తికొని) హా! బిడ్డలారా! మి మ్మెట్టికన్నులతోఁ జూచుచు జీవించి యుంటిని! (అని కన్నీరు నించుచున్నది)

చిక్క—(సాశ్రులోచనుఁడై) హా! నే నెట్టికఠినాత్ముఁడను? నేను నాకుటుంబము నెట్టిదీనదశలోఁ జూచుచున్నాఁడను? అయ్యయ్యో! సార్వభౌమతనూజుని చెట్టఁ బట్టి యంతఃపురమున నుండఁదగిన ముద్దుకోడలు, అత్తమామలతో నొక్కకారాగృహంబునం బడియుండుటఁ గన్నారఁ జూచుచు నాఁడుదానివలె విచారించుట తప్ప నేమియుం జేతగానివాఁడ నైతిని గదా! హా! ఫాలదైవమా! ఎంత నిర్దయుఁడవు?

తిరు—(కోపముతో)

సీ. అలిగినమాత్రఁ బో ♦ నాడి యింతలు సేయ
సాహసించినమంత్రిఁ ♦ జంపుదాఁకఁ
జెలరేఁగి శత్రులఁ ♦ జేరి పైఁబడుదుష్ట
దండనాథులగుండెఁ ♦ జెండుదాఁక
దురభిమానమునఁ గ ♦ న్నెఱుఁగనిజగ్గని
నిలువున నొలిపించి ♦ నెగడుదాఁక
శ్రీచంద్రగిరిరాజ్య ♦ సింహాసనం బంటు
పఱచినకుక్కను ♦ దఱుముదాఁకఁ

గీ. ప్రబలఘోరారికుంభికుం ♦ భముల కుఱికి
చీల్చి హరివిక్రమముఁ జూపి ♦ చెలఁగుదాఁకఁ
గాలకూటదావానలా ♦ భీలమైన
తిరుమలేంద్రునికోపంబు ♦ తీఱఁ గలదె?

ఆహాహా! మనకొఱ కెందఱెంద ఱెట్టికష్టముల నొందుచున్నారు? ఇంచుక కొఱంతగా సర్వంబును జయించినవీరనారాయణుండు కృతార్థుం డగుసమయంబునఁ దనయేనూఱుగురు భటులతోడను— అక్కటా! మనకొఱకు— నిలువున నఱికింపఁ బడెనఁట.

చిక్క—నాయనా! ఊరకుండుము. మన కిఁకఁ దెల్లవాఱినది. కాలము సమీపించినది. ఓబలరాయఁడు వచ్చునేమో?

(ఓబలరాయఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ఓబ—రాజనీతివిశారదు లగునాయనగారిసామర్థ్య మసాధారణము గదా! కాకేమి?



సీ. వేంకటపతిరాయ ♦ విభుసభ యాచశూ
రేంద్రునంతటివాని ♦ నెదిరినాఁడు
సిగపూవు వాడకుం ♦ డఁగ రాజ్యమంతయుఁ
దెచ్చి దౌహిత్రున ♦ కిచ్చినాఁడు
శత్రు లొనర్చుదు ♦ స్తంత్రంబు లన్నింటి
నన్నివిధంబుల ♦ నడఁచినాఁడు
పరుల పాల్గానున్న ♦ తఱిఁ గాంచి తనబుద్ధి
బలమున రాజ్యంబు ♦ నిలిపినాఁడు

గీ. భేదసదుపాయపటిమచే ♦ విజయ మంది
తన కెదురు లేక యుండఁ బె ♦ త్తనముఁ దాల్చి
ధరణి నిష్కంటకము సేయఁ ♦ దలఁచినాఁడు
మజ్జనకువంటివారె సా ♦ మాన్యనృపులు.

అసాధారణమేధానిధి యగునాతని నేఁటియానతియు సర్వశ్రేయస్సాధనంబై యున్నది. జాగు సేయ నేల? శీఘ్రము నిర్వర్తించెదఁ గాక! (కారాగృహము సమీపించి) చిక్కరాయా! ఇది చంద్రగిరిరాజ్యనిర్వాహకుం డగుజగ్గరాజేంద్రుని యాజ్ఞాపత్రిక. (అని యీయఁబోవుచున్నాఁడు.)

తిరు—ఓబలరాయా! బందిగమునం బడి కుందుచున్నమా కీపత్రిక లందించు టేల? నీవే చదువుము. విని యానందింతుము.

ఓబ—అట్లయినఁ జదివెదను. విని బ్రహ్మానంద మనుభవింపుఁడు.

(చదువుట నభినయించి)

"చిక్కరాయా!

ఇట్లున్న మీకుటుంబమూలమునఁ బ్రజలయం దల్లకల్లోలములు పుట్టి. రాజ్యాంగవ్యవహారముల కభ్యంతరము కలుగుచుండు

టయే కాక వేనవేలజనులకుఁ బ్రాణహానియుం గలుగుచున్నది.
నేఁటితో నట్టియభ్యంతరములతోఁబాటు మీకష్టములను గ
ట్టెక్కింపఁ దలఁచితిమి."

రాణి—(తనలో) ఏమి యీజగ్గరాయనియకారణకారుణ్యము! యా
చశూరునినిర్బంధమునకు లోఁబడి యిట్లు వ్రాసి యుండెనా?

చిక్క—(తనలో) ఏ మిది జగ్గరాయఁ డిట్లు వ్రాయుచున్నాఁడు?

తిరు—ఓబలరాయా! గట్టెక్కించుట యనఁ గడతేర్చుట యని యర్థ
ము కాదా?

ఓబ—ఔను. ఇది యర్థము. ఇం దింకొక యర్థ మున్నది.

చిక్క—ఆయర్థభాగమునుగూడ నీవే ముగియఁ జెప్పుము.

ఓబ—అంతయును ముగింపునకే వచ్చినది.

తిరు—ఈసాఁగఁదీయుట కేమి చదువుము!

ఓబ—అట్లయిన వినుఁడు.

"పరిమితజననిమిత్తంబున నశేషరాజ్యప్రజలు కలహించి చచ్చు
టకంటెఁ దత్పరిమితజనప్రాణవిచ్ఛేదంబె మేలు కదా! రాజ్య
రక్షణమునకును, బ్రజావనంబునకును మీపై నిట్లు తెగింప
వలసె. ఇట్లొనర్చిన నుభయత్ర శాశ్వతసుఖానుభవము కలు
గును. కావున నీవు నీస్వహస్తములతో నిన్నును, నీకుటుంబ
మును సంహరించికొని యీలోకమును విడువుము. అట్లు కా
దేని మేమె యాకార్యంబు తుద ముట్టింతుము."

ఇట్లు, జగ్గరాజు."

రాణి—హా! ప్రాణేశ్వరా! (అని మూర్ఛిల్లుచున్నది.)

చిక్క—(నిశ్చేష్టితుఁ డగుచున్నాఁడు.)



తిరు—(క్రోధముతో) ఓబలరాయా! ఏమి జగ్గరాయఁ డాఁడుదాని
కంటె నధమాధమావస్థలో నున్నాఁడు?

సీ. విడువక త న్నింత ♦ పెద్దగాఁ జేసిన
డెబ్బదియేఁడు లే ♦ దిబ్బ లెక్క?
మొనసి పారంపర్య ♦ ముగ వచ్చునన్వయ
మర్యాద తెల్ల నే ♦ మంటఁ బడియె?
దండనాయకబిరు ♦ దంబును గాంచిన
పౌరుషం బెల్ల నే ♦ పంచఁ బట్టె?
నిరుపమం బగురాజ ♦ నీతివైశద్యధీ
పాటవం బెల్ల నే ♦ యేటఁ గలిసె?
గీ. పురుషరూపంబుఁ దాలిచి ♦ పుట్ట లేదె?
క్షాత్త్రముం దాల్చి మొలఁ గత్తిఁ ♦ గట్ట లేదె?
ప్రజలు ఛీ! యనఁగా జగ్గ ♦ రాజు పెద్ద
తనముఁ బోనాడి మగముండ ♦ తనముఁ దాల్చె.

ఓబ—క్షత్త్రియులకు శత్రువిదారణము పౌరుషము కాదా?

తిరు—సంగ్రామరంగంబున శాత్రవసంహారంబుఁ గావించుట పౌరుషం
బు గాని,

సీ. కులహీనుఁ గాడు కంచుఁ ♦ గులుకుకూఁతురిపల్కు
పాటించి మెఱయుట ♦ పౌరుషంబె?
అసహాయు లగువారి ♦ నట్టె పైఁబడి పట్టి
బంధించి యుంచుట ♦ పౌరుషంబె?
అతినీచు నొకని సిం ♦ హాసన మెక్కించి
పడిగాపు పడి యుంట ♦ పౌరుషంబె?
అది గాక మమ్ము ని ♦ రాయుధులను జంపఁ
బత్త్రికఁ బంపుట ♦ పౌరుషంబె?

గీ. ప్రబలమాయామయత్వంబు ♦ పౌరుషంబె?
ప్రజలచేఁ దిట్టువడుచుంట ♦ పౌరుషంబె?
గడ్డమును మీసమును మొలఁ ♦ గత్తిఁ గలిగి
పడఁతిరూపు లేకుండుటే ♦ పౌరుషంబె?.

ఓబ—ఛీఛీ! దురాత్మా! భయము విడిచి కాఱు లఱచుచున్నావు?

తిరు—సమయ మైనప్పుడు ప్రాణములనైన విడువఁ దగినక్షత్త్రియకుమారుండ నగునాకు భయ మేమిరా?

ఓబ—కంఠముపైఁ దల యున్నంతవఱకు నీయిచ్చ వచ్చినట్లు పేలుము. ఇంకెంతయో కాలము లేదు.

తిరు—కాకినై కలకాల ముండుటకంటెఁ గోకిలనై కొంతకాల మున్నను మేలు గదా!

ఓబ—చచ్చువానికి మే లెక్కడ?

తిరు—మీ రప్పుడే బ్రదికితి మని సంతసించుచుంటి రా?

మ. అరిరాజన్యవనీకృశానుఁడు ప్రతా ♦ పార్కుండు రాజద్యశ
స్స్ఫురదాశావివరుండు శత్రుగళని ♦ ష్ఠ్యూతోగ్రరక్తాంబుని
ర్ఝరకల్లోలతరంగసంచలనచం ♦ చచ్చంద్రహాసుండు సు
స్థిరతేజోనిధి యాచశూరుఁడు జయ ♦ శ్రీలోలుఁ డేమయ్యె రా?

ఓబ—ఆఁ. ఉన్నాఁడు దొంగతనముగా బిడ్డల నెత్తికొని పోవుటకు.

తిరు—అబలలవలె నడఁగి యుండక యధిక్షేపించుట కూడనా? మోసమునకు మోసమే చేయవలయును. విసమునకు విరుగుడు విసమే కదా! అంతే కాక రాజ్యభారము నెత్తిఁ బెట్టికొని తల యెత్తికొని తిరుగుచున్న మీవంటి మగపంద లనేకులు నిరంతరము వేయిగన్నులఁ గాచికొనుచుండ మీకన్నులలో మన్నుఁ గొట్టి మీ తెలివితేటల నీటఁ గలిపి తనకార్యమును సాధించు



కొన్న యాచశూరుని మేధాకౌశల్యమును వేనోళ్లఁ బొగడినం దీరునా? చచ్చినపామును దలపైఁ బొడువు మన్నట్లు బందిగంబున నఱచచ్చి యున్న వారికి మరణశిక్ష విధించు మీవంటి నుగమ్మలు సత్క్షత్త్రియవంశమం దిదివఱకు జనియించి యుండ లేదు. ఇసీ! ఇది యెంత ఘనకార్యము?

ఉ. పౌరుష ముండెనేని వెడ ♦ పల్కు లికేటికి లేచి రార! యీ
కార నెడల్చి నాకు నొక ♦ కత్తి నొసంగుము, పైన నీవు నీ
వారును వారివారును జ ♦ వంబున నొక్కట నన్నుఁ దాఁకుఁడీ
పోరెదనంచు నానుడిగఁ ♦ బోయి వచింపుము జగ్గరాజుతోఁ.

ఓబ—ఛీ! పేలరీ! పట్టువడినపామువలె నెంత చుట్టుకొని పోవుచున్నావురా? తల నొక్కువఱకును నీమిట్టిపాటు వదలదు.

తిరు—కృత్రిమపథానువర్తు లగుమీచే నీశరీరంబులు పట్టువడి యుండెను గాని యంతర్యామి యగుపౌరుషము పట్టువడెనా? ఈపట్టు వదలి చూడుము?

ఓబ—ఇట్టి వృథాప్రలాపములవలన నేమి లాభము? మీకొకముహూర్తమాత్రమే గడు వున్నది. ఇంతలో మాయాజ్ఞ సంపూర్ణముగ నిర్వర్తింపవలయును. లేకున్న మేమే యాపనికిఁ బూనుకొనవలసి వచ్చును. కానిమ్ము. ఇదిగో! (అని కత్తి పడవేయుచున్నాఁడు.)

తిరు—(కత్తి నందికొని కోపముతో) ఛీ! ఛీ! తులువలారా! చంద్రవంశ్యు లగురాజులరక్తంబునఁ బ్రీతియఱుపునందును బౌరుషము మెఱయుచుండఁ జెఱకుతోఁటలోని వెదురుబొంగులవలె నంతస్సారశూన్యులై కులకళంకు లగుమీరు చేరితిరి. కాలము నవవలయును గాని మి మ్మన నేల? (గుండెపైఁ జేయి

పెట్టి) ఈమేనులు వేఱొక్కనిచేఁ బడఁదగినవా? (కత్తిఁ దిప్పుచు) భీకరం బగునీకరవాలము నాచేత నున్నంతవఱకు మమ్మెవరులు తేరి చూడనైనఁ జాలుదురా? దురాత్మా! పాపీ! అధమాధమా! తలుపుదీయుము? నీవే యాపని చేయవలసి వచ్చునంటివా? ఎదిరి పోరాడలేని పిఱికిపంద లగుమీ కిట్టితఱి నైనఁ జులుకుదన మున్నందులకు వింతగా నున్నది. బోనునం బడినసింగంపుఁగొదమలవలె సకుటుంబముగఁ గారాగృహంబున నిదివఱకే సగముప్రాణములు పోయియున్న మాకడనా నీప్రతాపములు? పౌరుషవంతులకుఁ బ్రాణములు తృణప్రాయములు కావా? ఇదిగో! ఒక్కనిముసము నిలిచి చూచుచుండుము. (అని కత్తి నెత్తికొని భార్య యగువీరాంబకడకుఁ బోవుచున్నాఁడు.)

రాణి—(అదరిపడి లేచి యడ్డగించుకొని) హా! తండ్రీ! ఇఁక మన కింతే గతియా? అయ్యో! కుటుంబమంతయు నొక్కసారి చావవలసినదేనా? నాయనా! దీనికిఁ బ్రతీకారము లేదా! కారాబద్ధుల మైయున్నమనమూలమున నాజగ్గరాజున కేమిపుట్టి మునుఁగనున్నదని యెంచెనురా? హా! కన్నతండ్రీ! హా! బిడ్డలారా! నేఁటితో మనకు సంబంధము వదలనై యున్నదా? ఋణము తీరి పోయినదా?

తిరు—విచారించిన లాభ మేమి?

ఉ. తల్లి! ఋణంబు దీరెఁ దలి ♦ దండ్రులు బిడ్డ లటంచుఁ బల్కఁగాఁ
జెల్లద యింకమీఁద మన ♦ చిత్తము రంజిలఁ గార నుండియుఁన్
జల్లనిపల్కు లాడికొని ♦ సంతస మందుదినంబు లేగె హా!
గొల్లుమనంగ నొక్కకరి ♦ గొంతును గోయుట నిల్చె నాపయిన్.



రాణి—(దుఃఖముతో) అయ్యో! తండ్రీ! అంతయేనా?

ఉ. నల్లి యొకింత కుట్టిన ఘ ♦ నవ్యథ నందెడుచిన్నితమ్మునిన్
జెల్లెలిఁ గత్తివాతి కెఱ ♦ సేయఁ దలంచితె! సౌకుమార్యసం
పల్లలితాంగి నీవలపు ♦ పంటను మిత్తికి దాసిఁ జేసెదే!
తల్లిని దండ్రినిన్ జితికిఁ ♦ దారిచి పుణ్యముఁ గట్టికొందువే!

తిరు—జననీ! న న్నేల దూరెదవు? విధినియోగంబున నీనిర్భాగ్యుఁ డిట్టియవస్థలో నున్నాఁడు. తీవ్రకోపదుఃఖములచే నాహృదయము దహించుకొని పోవుచున్నది. ఇఁక విడువుము. న న్నాఁగకుము.

రాణి—నాయనా! తొందర పడకుము. నీతండ్రిగారియానతి వలదా? ఉపాయాంతర మేమైన నాలోచించి చెప్పెదరేమో విందము.

తిరు—అయ్యో! వెఱ్ఱితల్లీ! ఆఁడుదాన వగుటచే సహజ మగునీబేలతనంబున ని ట్లనుచుంటివి గాని కఠోరవార్తాశ్రవణంబునఁ గొరషువారి యున్ననాయనగారుమాత్ర మిందుల కేమి చెప్పఁగలరు?

రాణి—నాయనా! అ ట్లనకుము. పెద్దలు గదా రమ్ము.

(ఇరువురును జిక్కరాయని సమీపింతురు.)

చిక్క—(కొంచెము తెలివి నంది) కుమారా! నిర్భాగ్యుఁడను వంశనాశనకారకుఁడను నగునాకడ కేల వచ్చితివి?

తిరు—ఆజ్ఞకొఱకు—

చిక్క—దైవాజ్ఞ యిట్లుండ మన మేమి చేయఁగలము?

రాణి—(దుఃఖముతో) అయ్యో! ప్రాణనాథా! అంతేనా? దీనికిఁ బ్రతీకారము లేదా? మన మిఁక నొండొరులం జూచికొనుట లేదా? భూమిపై నేఁటితో మనకుటుంబమునకుఁ బేరు లేదా?

చిక్క—ప్రాణేశ్వరీ! అంత మాట యనకుము.

గీ. అంగములతోడ నీదేహ ♦ మడఁగి పోవ
నాత్మకల్పాంతరస్థాయి ♦ యైనయట్లు
మనము సకుటుంబ మిందు నా ♦ శనముఁ బొందఁ
జిన్ని శ్రీరంగపతి చిరం ♦ జీవి యగును.

దాని కిదియే యుపసంహారము. హా! హా! కాలమా!

ఓబ—ఆతనిమాత్రము పోనిచ్చెదమా?

తిరు—ఏమి చేసెదవు? ఆతఁడు మావలె బందిగంబున లేఁడు గదా! చెఱలో నున్నవారిని నిదుర వోవువారిని జంపుటకే గాని యెదిరించి పోరాడుటకు మీకు పౌరుష మెక్కడిది?

ఓబ—పౌరుషము కలదు గనుకనే శత్రునిశ్శేషమున కుపాయ మాలోచించి సాధించుచున్నాము. మున్నశ్వత్థామ యేమి చేసెనో యెఱుఁగవా?

తిరు—అట్టి దుండగ మాఘూర్త బ్రాహ్మణునకే చెల్లినది గాని యుత్తమక్షత్త్రియుం డెవ్వఁ డట్టిపని చేయఁ గలఁడు? అయిన నాతఁ డేమి సాధించినాఁడు? పరీక్షిన్నరేంద్రుఁడు మిగుల లేదా? తుదకు మీప్రారబ్ధము నట్టిదియే.

చిక్క—అంతే. అంతే. ముమ్మాటికి నంతే.

ఓబ—దీనితో మీ కంతే.

చిక్క—ఓబలరాయా! జగ్గరాయఁ డింతదుర్మార్గమునకుం జొచ్చెనేమి? నీ తెలివి యే మయ్యెను? ఇట్టి రాక్షసకృత్యమా? లోకము లేదా? దానికైన వెఱవ వలదా? భగవంతుఁడు లేఁడా? వానికైన జంకవలదా? పాపభీతి వలదా? మనుష్యజన్మ మెత్తినందులకుఁ దగినట్లయిన నడుచుకొన వలదా? ఇది తనకై చెప్పుచుంటిని.



ప్రాణము లన్న తృణప్రాయముగ నున్న నా కేభయమును లేదు. దయాదాక్షిణ్యములు వలదా? బిడ్డలఁ గన్నకడుపు గాదా?

తిరు—ఆ. కన్నాఁ డొకగొడ్డుబిడ్డను.

చిక్క—ఆతనికి నావలన నేమైననష్టము కలిగెనేమో గాని యేపాపపుణ్యము లెఱుంగనియీపసిబిడ్డ లేమి చేసిరి?

చ. గడుసుఁదనంపునారసపు ♦ కట్టడముల్ బలమైనరాతిద
ద్దడమును గల్గునింట మముఁ ♦ దారిచి కట్టితి రట్టిమేము మీ
యొడయని కెగ్గు చేసెదమొ? ♦ యోబలరాయ! యి దేటియాజ్ఞ? యీ
కడిపెడిబిడ్డలన్ గఱకు ♦ కత్తికి నగ్గము సేయఁ జెల్లునే?

ఓబ—నీచేతులారఁ జంపవలయు ననియే జగ్గరాయనియాజ్ఞ.

తిరు—(క్రోధముతో) ఛీ! ఛీ! తులువా! క్షత్త్రియకులకలంకా! మఱల మఱల నట్లే ప్రేలుచుంటి వేమిరా? నీ కట్టియవకాశము కలుగనిచ్చెద మఁటరా? (అని కత్తి నెత్తి వీరాంబవైపునకుఁ బోవుచున్నాఁడు.)

వీరాం—(ఎదురు వచ్చి నమస్కరించి కంఠమును వంచుచున్నది.)

రాణి—(పరుగునం జని కోడలినిం గౌఁగిలించుకొని) అయ్యో! తల్లీ! వీరాంబా!

ఉ. మాయురె! సార్వభౌమునికు ♦ మారుని మన్ననఁ గాంచుపత్నివై
యేయెడ నిష్టభోగము ల ♦ నేకము లందఁగ నున్ననీకు న
య్యో! యిటు లత్త మామయు న ♦ హో యని యేడ్చుచునుండఁ గుత్తుకం
గోయఁగ వచ్చునాథునకుఁ ♦ గోమలి! కంఠ మొసంగ నయ్యెనే!

వీరాం—అత్తా! ఏల విలపించెదరు? ఎప్పటికైనఁ జావున్నది గదా! ఇట్టి యల్లకల్లోలం బగుసమయంబున నభిమానధనంబునకుం

గోరంతయుఁ గొఱంత రాకుండఁ గాంతుని గన్నాఱం జూచుచు నాయనఘుహస్తములలోఁ బ్రాణములు విడుచుటకంటె భాగ్యమున్నదా ?

రాణి—హా! సుగుణరాశీ! సాధ్వీమతల్లీ!

సీ. తతపుష్పహారశో ♦ భితము నీకంఠంబు
కరవాలహతికి న ♦ ర్గంబె తల్లి!
సుమసుకుమారభా ♦ సురము నీనెమ్మేను
బలుకత్తిపోటుల ♦ పాలె తల్లి!
కలకలలాడు చ ♦ క్కనినీమొగముకాంతి
చంద్రహాసంబుతో ♦ సరియె తల్లి!
కఠినాత్మకులనైనఁ ♦ గరఁగించునీరూపు
వెడఁగుమిత్తికిఁ గను ♦ విందె తల్లి!
గీ. భూమి నీమన్కి విధికంటి ♦ పోడుపె తల్లి!
కరము నీయున్కి ధరణికి ♦ భరమె తల్లి!
అరయ నీపోల్కి కాలుని ♦ కళుకె తల్లి!
ధాత్రి కింక నీవిన్కిమా ♦ త్రంబె తల్లి!

అయ్యో! హృదయభేది యగునీదుఃఖమును భరింపఁ జాల. హా! దైవమా! (అని మూర్ఛిల్లుచున్నది.)

తిరు—ఇది సమయము. (అని కత్తి నెత్తి వీరాంబను సమీపించుచున్నాఁడు.)

వీరాం—హృదయేశ్వరా! నన్ననుగ్రహింపుము. భవదుద్యమము క్షత్త్రియలోకసంభావ్యము.

తిరు—(కత్తి నెత్తి వ్రేయశంకించుచున్నాఁడు.)

వీరాం—ప్రాణేశ్వరా! ఏల యీమనోవైకల్యము? హృదయము పదిలపఱచుకొనుఁడు.



తిరు—నాహృదయము వజ్రకఠినమే యైనది. వీరవిహారప్రౌఢి నెఱపు ఖడ్గముమాత్రము స్త్రీహత్యాపాతకమునకు శంకించుచున్నది.

వీరాం—నాథా! క్షత్త్రియవంశ్యులకు శస్త్రమరణంబుకంటె సుత్కృష్టమైనది వేఱొండు లేదు గదా! ఎత్తినచేయి నిలిపి దేవర పౌరుషంబునకుఁ గొఱంత తెచ్చికొన నేల? శీఘ్రముగా నన్ననుగ్రహింపుఁడు.

తిరు—(కన్నీటితో) ప్రేయసీ! నిశ్చలహృదయంబున భగవద్ధ్యానమును గావించుకొనుము!

ఓబ—తిరుమలరాయా! త్వరపడుము! ఏటి కీధ్యానములు! ఆఁడుదానికిఁ గల ధైర్యములో సహస్రాంశమైనను నీకు లే దేమి?

తిరు—(క్రోధముతో కత్తి ద్రిప్పుచు ద్వారమువద్దకు వచ్చి) ఛీ! దురాత్మా! పాపీ! చండాలా!

శా. స్వస్త్రీమారణదారుణాఘమునకుం ♦ శంకించె; శంకించునే
నిస్తంద్రప్రతిభావిభాసితము ని ♦ ర్ణిద్రప్రతాపారిరా
జ్ఞాస్తచ్ఛేదనదుర్నివార మగున ♦ స్మత్తీవ్రకౌక్షేయకం
బస్తోకాహతి నీశిరం బొకట దు ♦ న్మాడంగనో దుర్మతీ!

కాచికొనుము! (అని యినుపయూచలనడుమనుండి కత్తి పైకి వచ్చునట్లు విసరుచున్నాఁడు.)

ఓబ—(భయమునఁ బాఱి పోవుచున్నాఁడు.)

నేపథ్యమున కలకలము.

(తెర పడును.)

ఇది పంచమాంకము.

శ్రీ

# యాచశూరేంద్రవిజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## షష్ఠాంకము.

(ప్రవేశము విష్ణుశర్మ.)

విష్ణు—ఏమిది! నేను తీర్థయాత్రకుఁ బోయి వచ్చినయింతలోనే యీ చంద్రగిరిపట్టణ మింతటిమార్పు నొంది యున్నది. పూర్వమర్యాద ననుసరించి కోటలో వేత్రహస్తులసందడితీర్చువాద్యధ్వనులు గాని, వందిమాగధులకైవారములు గాని యేవియుఁ గానరాకున్నవి. పట్టణ మెచ్చటఁ జూచిన లక్ష్మీవిహీనం బైనగృహముచందంబున వెలవెలపోవు చున్నది. ఏవంకఁ జూచిన యుద్ధసామగ్రిలం గొనిపోవు శకటంబుల రాయిడిచేతను, గార్యత్వరచేఁ గాఁబోలును నిటునటు వడివడిగా నడచిపోవుచున్న జనుల కలకలముచేతను సందడి హెచ్చుగా నున్నది. దీనినిబట్టి చూడఁగా మహాయుద్ధము సంభవించినట్లు తోఁచుచున్నది. మహారాజదేవేంద్రుఁ డైన శ్రీకుమారచిక్కరాయలకు విద్యాగురుండ నౌటచే నాతనిచే ముందుముందు మహావిభవము నందవచ్చు నని యువ్విళులూరుచున్న నాయాశాపాశము త్రుటితమైనట్లే



హృదయమున నలజడి పొడము చున్నది. హా! నే నుపాసించు చున్న శారదకు నాయెడ దయ తప్పినది.

(తెరలో)

ఇది శారదవిక్రృతియే.

సీ. పోటరుల్ శత్రులఁ ♦ బొడిచి యెత్తిన బల్లె
ములఁబోలెఁ గదలికల్ ♦ మొగ్గ దొడిగె
పటుశక్తిఁ జూపి లోఁ ♦ బడినవీరులరీతి
చెలరేగి వరిచేలు ♦ తలలు వంచె
గెలుపుఁ గైకొన్నయో ♦ ధులకీర్తిలత దెస
లెల్లఁ బ్రాఁకినయట్లు ♦ ఱెల్లు పూచె
సత్పాలనముక్రింది ♦ జనులమానసముల
కరణి నద్యంబువుల్ ♦ కలఁక దేఱె
గీ. శౌర! యీచారుశరదాగ ♦ మావసరమె
చటులసంగ్రామకరణావ ♦ సరముఁ దెలుప
విపులబలపరాక్రమయశో ♦ విభవులైన
భూవరులకుఁ బౌరుషములు ♦ పుట్టకున్నె.

విష్ణు—(ఆలకించి) అదిగో! మా రామశర్మ శరద్వర్ణనము చేయుచున్నాఁడు. యుద్ధమారంభ మైనట్లే. రామశర్మ! ఇటురమ్ము.

రామ—(ప్రవేశించి) గురువరా! నమస్కారము. తీర్థయాత్రనుండి మీ రెప్పుడు విచ్చేసితిరి?

విష్ణు—ఇప్పుడె. అందఱును సేమముగానున్నారా?

రామ—ఆ. తమదయవలన. మనగృహములలో—

విష్ణు—రామశర్మా! ఇదియేమి? పట్టణము వెలవెలఁబోవుచున్నది!

రామ—మీకుఁ దెలియలేదు. యాచశూరుఁడెత్తివచ్చినాడు. నేఁటికి

రెండుదినములనుండి తోపూరులో యుద్ధముజరుగుచున్నది.

విష్ణు—ఇన్నిదినములనుండి యూరకున్నయాచశూరున కిప్పు డేల యెత్తి రావలసి వచ్చెను?

రామ—నిరపాయముగఁ దాను రక్షింపఁ దలంచిన చిక్కరాజకుటుంబము జగ్గరాజువలన సమసిపోవుటచేత.

విష్ణు—అదియేనా కారణము! నేను వినినట్లే యైనది. అది యతిదారుణకృత్యము. వలలోఁ జిక్కుకొనిన పక్షులవలె నున్నవార లాత్మహత్య యెట్లు కావించుకొనిరి?

రామ—అబ్బ! ఆసమయముం దలంచుకొనిన నాయొడలు జలదరించుచున్నది. నాఁడు ఓబలరాయఁడు పలాయనమైనతఱి కలిగిన భటులసందడిలో నేనును లోని కరిగి యాఘోరకార్యము కన్నారం జూచినవాఁడ నగుటచే నాకిప్పుడు తలంచికొని నంతమాత్రముననే కన్నులఁ గట్టినట్లున్నది.

విష్ణు—భటులసందడియేమి?

రామ-జగ్గరాజాజ్ఞ విని తిరుమలేంద్రుఁడు ప్రళయకాలరుద్రాకారముం దాల్చి జగ్గరాజాదుల నధిక్షేపించుచు వీరావేశముచేఁ దాను కారాగృహములో నుండుట యైన నెఱుంగక కరవాలమ్ము నోబలరాయని పైకివిసరఁగా నాయదటునకు బెదరి యోబళరాయఁడు పలాయితుఁడైనాఁడు.

విష్ణు—తరువాత!

రామ—అంత తిరుమలరాయఁడు కారాగృహవిముక్తుఁ డగుటకు వలనుగానక విసివి విసివి జగ్గరాయఁడు మఱియు నేమేమి యవమానము లొనరించునో యని చింతిల్లి భార్యయగువీరాంబను నఱికి ‹‹హా! సోదరా! శ్రీరంగరాయా! ఈకుటుంబమునకు నీవే



వంశకర్తవై వర్ధిల్లునట్లు దైవ మనుగ్రహించుఁగాక! ఓపుణ్యశీలా! యాచశూరా! నీమహోదారచరితం బాచంద్రతారార్కమై వెలయుఁగాక! దురాత్ములు విజితులై నశించెదరుగాక! ఈనాతల మాచిన్నితమ్ముఁ డగుశ్రీరంగరాయని యదృష్టదేవతకు బలియగుఁగాక!'' అని తండ్రి వలదనుచుండఁగనే తానుగూడ తల తఱిగికొని నేలపైఁ బడియెను.

విష్ణు—అయ్యో! ఎంతదారుణకృత్యము!

రామ—ఇది యేమి దారుణము! తిరుమలరాయనిమరణముం జూచిన దుఃఖంబున చిక్కరాజు మూర్ఛపడిపోఁగా నంతట రామరాయలు తనవదినగారిమొలలో మానసంరక్షణార్థమై యుంచుకొన్న కత్తిం దీసి తనచెల్లెలిని నఱికి తానును బొడుచుకొని పడిపోయెను.

విష్ణు-ఔరా! క్షాత్త్రవంతము! పదియేండ్లకుఱ్ఱవాఁ డెంతపని చేసెను!

రామ—పిమ్మటఁ జిక్కరాజు దుఃఖాతిరేకంబున గుండె రాయిచేసికొని యదివఱకే మూర్ఛవడియున్న రాణిని నఱికి బిడ్డలపాటునకుఁ జింతించి ‹‹ఓరీ క్షత్త్రియపశువులారా! ఈయపకీర్తిఁ దలపై నిడికొని కలకాలము జీవింపుఁడు. దైవమే యున్నయెడల మీదుష్కృత్యమునకుఁ దగినఫల మనుభవింపఁ జేయకపోదు. హా! దైవమా! మమ్మగతికులం జేయక చిన్నికుమారశ్రీరంగరాయనికి మాయందఱియాయువుల నొసంగి వర్ధిల్లఁ జేయుము.'' అని తానును బొడిచికొని పడియెను.

విష్ణు—సర్వమును సమాప్తమైనది. ఇది జగ్గరాజునకు మాయని యపకీర్తి యనెడుమచ్చ. ఈదుఃఖవార్త యంతయును విని యాచశూరుఁడు రౌద్రావేశమున నాకస్మికముగ యుద్ధముఁ జేయవ

చ్చెను గాఁబోలును.

రాప—అట్లు కాదు. యాచశూరుఁడు ముందుగా “రాజ్య మిచ్చెదవా? యుద్ధ మిచ్చెదవా?” అని జగ్గరాయనికి వార్త నంపెను.

విష్ణు—ఏమి యీపరాక్రమవిజృంభణము? అందులకు జగ్గరాయఁ డేమనెను?

రామ—శూరుఁడవైన యుద్ధమునకే రమ్మని చెప్పి పంపెను. కావుననే యెత్తి వచ్చినాఁడు.

విష్ణు—మహారాజకుమారచిక్కరాయలు భద్రముగ నున్నాఁడా?

రామ—ఆ.

విష్ణు—ఎచ్చట?

రామ—రాజనీతివిదుఁ డగుజగ్గరాయ లామహారాజకుమారుని భూబిలమునుండి శత్రువుల కభేద్య మగునొకరహస్యస్థలమునకుం గొనిపోయి యచ్చట భద్రముగఁ గాపాడుటకు సేనలఁగూడఁ బంపి యున్నాఁడు.

విష్ణు—ఆప్రదేశము నీకుఁ దెలియునా?

రామ—ప్రత్యుత్పన్నమతు లగునీతికోవిదుల గూఢపరివర్తనంబు లితరుల కెట్లు తెలియును?

విష్ణు—అట్లయిన నిది యెట్లు తెలిసినది?

రామ—ఇట్లనియే జనప్రవాదము.

విష్ణు—(తనలో) మహారాజరక్షణమునకు దుర్గమునకంటెను భద్రమగుస్థల మొక్కటి యున్నదా? ప్రజ్ఞానిధి యగుజగ్గరాయనికిఁ గూడ మహారాజును గోటనుండి వెడలించి యొకవివిక్తస్థలంబున రక్షింపవలసి నంతయవసరము వచ్చినది కాఁబోలును? అయిన నిది యుక్తియుక్తముగాఁ గనఁబడుట లేదు. కుమారచిక్కరాయహరణము వైరులచేతనే జరుపఁబడి రాజ్యతంత్రజ్ఞుఁ డగుజగ్గరాయనిచే నిట్లు మాటువడియుండలేదుగద! (ప్రకాశముగ) రామశర్మా! తోపూరియుద్ధవార్త లేమైనం దెలియుచున్నవా?



రామ—తెలియుచునే యున్నవి. ఎంతయో సహాయము చేయఁగలఁడనినమ్మియున్న మంత్రియగు పెమ్మసానితిమ్మరాజు సోదరసహితుఁడై ససైన్యముగ యాచశూరునిచే నీదినముననే చంపఁబడియెనఁట!

విష్ణు—అయ్యో!—జగ్గరాయనికి సవ్యాపసవ్యభుజంబులై పరాక్రమధనులగు మేచరాయతిమ్మానాయకుల సంగ్రామవిజృంభణ మెట్లున్నది?

రామ—ఏమిచెప్పను? వా రీవఱకే రాయభూపాలునిచే—

విష్ణు—కడతేరిరా? ఇంకేమున్నది? యాచశూరుని సోదరుఁడగు రాయభూపాలు డంతటివేర్పరియా? అనుకొనినట్లే యయినది. వృథా రాజకుటుంబసంహరణమహాపాతక మూరకపోవునా? “అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్” అనునట్లు చేసికొన్నవి యనుభవింపక తీఱునా? ప్రజారంజనము లేనిపరిపాలనము వర్ధిల్లుట కష్టము! కష్టము! ధర్మమే జయము.

రామ—విచారించి మనమేమి చేయఁగలము? పథశ్రమచే మిగుల డస్సియున్నారు. గృహమునకు దయచేయుఁడు.

(అని నిష్క్రమించుచున్నారు.)

(విష్కంభము.)

రంగము:—తోపూరుయుద్ధభూమియందలిశిబిరము.

(కత్తి చేతఁ బూని తత్తరముతో రాయభూపాలుఁడు ప్రవేశము)

రాయ—(ఆలోచన నభినయించి) “అలసితి చాలనిట్టితఱి నాఁగుము

చంపని దేటిపౌరుషంబు" అని మాయన్నగారగు యాచశూ
రేంద్రుని పలుకులుగా వినఁబడినవి. ఇట్టి దుస్స్వప్నము కలుగు
ట కేమికారణము?——కాదు. ఇది స్వప్నము కాదు. ఇరువదివే
లసైన్యముతో నేతెంచి యరువదివేలసైన్యము నెదిరించి శత్రు
వులను మూఁడుదినములలో జయించిన యన్నగారి సంగ్రామ
కళాకౌశల్యముం దలంచికొనుచు, తుట్టతుదకు గనుఁగప్పి పాఱి
పోయిన జగ్గరాయనిం బట్టుకొను టెట్లని యాలోచించుకొనుచు
రేయెల్ల మేల్కనియున్న నాకు స్వప్న మెట్లు వచ్చును?——ఇవి
నిక్కముగా మాయన్నగారిపలుకులే——ఆఁ! ఏమి!

చ. అలఘుపరాక్రమస్ఫురణ ♦ నాహవభూమిని శాత్రవాళిగుం
డె లవియఁ దాఁకి వారలను ♦ నేలకుఁ గోలకుఁ దెచ్చి కూల్చుచోఁ
బ్రలయకృశానుఁడో యనఁగ ♦ భాసిలు చుండినయాచశూరుఁడే
నలసితిఁ జాల నాఁగుమని ♦ యాడునె? వేడునె యొక్కమానవున్

ఇది వట్టిదుర్భ్రమము——భ్రమము నొందుటకును గారణము లే
దు. భ్రాంతికిఁ గారణముగా ననుమాన మొకటి యుండవల
యునుగదా. ఆమహామహుని కట్టిగతి కలుగుననను ననుమాన
ము స్వప్నమందైనను బుట్టుటకు గారణ మగపడదు.

సీ. అఱువదివేలసై ♦ న్యం బున్న లెక్కింప
కరుల నెదుర్ప ము ♦ న్నాడినాఁడు
అలపెమ్మసానితి ♦ మ్మామాత్యుఁ డెదిరింప
నతని మున్మున్న దు ♦ న్మాడినాఁడు
కమలంబులఁ బెకల్చు ♦ కరిరాజుపోలిక
నరిరాజవరుల ను ♦ గ్గాడినాఁడు
నలువురిలో జగ్గ ♦ నరనాథుఁ బరుసంబు



లాయంబు లుచ్చిపో ♦ నాడినాఁడు
సకలశాత్రవసైన్యంబు ♦ సంహరించి
నేఁడె యానందవార్ధి నో ♦ లాడినాఁడు
యాచశూరేంద్రుఁ డట్టిమ ♦ హామహునకు
నిట్టు లగు నని యనుమాన ♦ మెట్టు కలుగు?

ప్రియమైనవానియెడలఁ గీడు గల్గునేమో యని శంకించుచుం
డుట సహజము. ఇప్పు డీసంభ్రమమునకు మాయన్నగారిపైఁ
గలప్రేమానుబంధమే కారణము. ఒకసారి పోయి చూచి మా
టాడువఱకు నా కీగుండెదిగులు తీఱదు. (పరిక్రమించి) ఇదె
మాయన్నగారిశిబిరము. ఇందలిద్వారరక్షకులు గురుకలువెట్టి
నిదురించుచున్నారు.

గీ. జయము గల్గిన యప్పుడు ♦ సైనికులకు
తెలతెలఁగ వేగునప్పుడు ♦ తలవరులకు
ప్రభుఁడు నిద్రించుతఱి ద్వార ♦ పాలకులకు
శరణ మగునది తలఁప ♦ నిద్దురయె కాదె.

(కోపముతో) ఓరీ! ద్వారరక్షకులారా!

ద్వార——(అదరిపడి లేచుచున్నారు.)

రాయ——ఛీ! ఛీ! సోమరులారా!

చ. ఎఱుఁగరె? యుద్ధరంగమున ♦ నెంతయుప్రొద్దు జరించి మించి ని
ద్దురఁ గనుచుండుభూభరణ ♦ ధూర్వహునిం గడు జాగరూకులై
యరయుచు నుండఁగా వలయు ♦ నంచును దుర్మతులార! యిట్టు లే
మరి రణభూమి శత్రుజన ♦ మధ్యమున న్నిదురింపవచ్చునే?

సత్వరంబున లోని కరిగి నారాక మాయన్నగారికి నివేదింపుఁడు.

ద్వార——(లోనికిఁ బోయి వచ్చి గడగడ వడఁకు చున్నారు).

రాయ—(తత్తరముతో) అట్లు వడఁకెద రేల? మాయన్నగారు మీ
పై కోపపడిరా?

ద్వార—అగపడనే లేదు బాబూ!

రాయ—ఆఁ! ఆఁ! ఆఁ! అగపడనే లేదా? నిద్దురకన్నులతోఁ జూ
డలేదు గద!

ద్వార—అయ్యో! నలుదెసల వెదకితిమి. కానరాలేదు. మంచము
నొద్దఁ గత్తికూడ లేదు.

రాయ—(తత్తరముతో పరిక్రమించి లోనికిఁ బోయి మఱలి వచ్చి ని
ట్టూర్పు పుచ్చి) హా! అగ్రజా! ఇంకను సంశయ మేల? ఆ
పలుకులు నీవే! అయ్యో!

సీ. ఉత్తరమల్లూరి ♦ యుద్ధంబునను శత్రు
లలమిన నైన ను ♦ స్సనఁగ లేదు
మధురావిభునిఁ జెంజి ♦ మన్నీని మదమడం
చినయప్పుడును జెక్కు ♦ చెదర లేదు
సార్వభౌమునిదిగ్వి ♦ జయము సాధింపఁగా
నరిగినప్పుడు నింత ♦ యలయ లేదు
అవలీలఁగ జయంబు ♦ నందుటయే కాని
నేఁడును దలపూవు ♦ వాఁడ లేదు
అకట! జయలక్ష్మిఁ గైకొని ♦ హాయిగాఁ బ
రున్నయప్పుడు నినుఁ బట్టి ♦ కొన్న దొంగ
తోడఁ బోరాట మొనరించి ♦ తూలి తూలి
యలసి కడు దైన్యభావంబు ♦ నంది తయ్యో!

అయ్యో! దైవమా! యిది యంతయు మాయగా నున్నదే!—
ద్వారపాలకులారా! మాయన్నగారిని మీ రింతకుముం దైనఁ



జూచితిరా?

ద్వార—అయ్యా! క్షమింపుఁడు! మూఁడవజాము కావలివారివెనుక
మేము నాలవజామున వచ్చి ద్వారముననే యుంటిమి. వచ్చి
నాలుగునిముసము లైనఁ గాలేదు. లోని కరిగి రాజుగారిని చూ
డనే లేదు. అయ్యో! ఈదిక్కుమాలిన పాడునిద్దుర పెద్దమ్మవ
లె మాతలకెక్కినది గాని లేకున్నఁ బ్రాణ మున్నంతవఱకు
లోని కెవరి నైనఁ బోనిత్తుమా! అయ్యో! అయ్యో! అయ్యో!
(అని గుండెల బాదుకొనుచున్నారు.)

రాయ—ఎవ్వరో దురాత్ములు నిద్రాసమయంబున నాయనం బట్టికొని
పోయియుండుదురు. ఇదియే నిశ్చయము—ఎవ్వరో యననేల?
మాయలకు శంబరాసురుని మించినదురాత్ముఁ డగుజగ్గఁ డింకను
జీవించియున్నాఁడు గదా! ఆకారణంబుననే కదా నాకు రాత్రి
యంతయు మేల్కనియుండి శ్రీరంగరాయకుమారుని వేయిగ
న్నులఁ గాచికొనియుండవలసివచ్చినది! ఇట్టిదుర్వార్త విని సా
ర్వభౌమకుమారుఁడుగూడ నెట్టిగతికి వచ్చునో గదా! హా!
సోదరా! కాలము క్షణక్షణమునకు వింతమార్పు నొందుచున్న
ది.—అక్కటా! ఇఁక నాసోదరునిపోఁబడి యెట్లు తెలియఁగల
దు? అయ్యో! ఇఁక మాగతి యింతియేనా?

సీ. శ్రీరంగరాజకు ♦ మారునిపాలింటి
కోరకచేరుమం ♦ దారతరువు
అనవరతంబుఁ దో ♦ డై యుండి విజయంబుఁ
జేకూర్చునాదుద ♦ క్షిణభుజంబు
వేంకటగిరిరాజ్య ♦ విభవసముద్ధర
ణాధారసంజీవ ♦ నౌషధంబు

ఉసురు లోమఁగ లేక ♦ దెసమాలి విలపించు
పేదలపాలింటి ♦ పెన్నిధాన
మకట! శ్రీయాచశూరక ♦ ల్పకము నేఁడు
కపటమతు లైనశత్రురా ♦ క్షసులచేతఁ
జిక్కికొని చేయునది లేక ♦ యుక్కు దక్కి
సంచలించుచు నుండెనే ♦ వంచనమున?

హా! సోదరా! ఇఁక నాకు నీదర్శన మీయవా? సమాదరశీత
లంబు లగునీపలుకులు నేఁటితో నాకు కఱవై పోయెనా?

(తెరలో)

చ. అలసితి చాల నిట్టితఱి ♦ నాఁగుము చంపని దేటి పౌరుషం
బు? లఘుచరిత్ర! యెక్కడకుఁ ♦ బోయెదు? నొచ్చెదు యాచ
శూరభూ
తలపతి కగ్గమైతి విఁకఁ ♦ దప్ప దిదేటివృథాశ్రమంబు? చీ!
పలువ! వెడంగ! దొంగ! పశు ♦ వా! యిఁకఁ జిక్కితి వెందు
బోదురా

రాయ—(ఆలకించి ఆనందముతో) అదిగో నాసోదరుఁడే. ఆవాక్య
ము లాతనివే. ఇంతవఱకు నే నపార్థముం జేసికొని తల్లడిల్లితిని.
ఏమి నాయదృష్టము!

(జగ్గరాయని సందిట నిఱికించుకొని యాచశూరుఁడు
ప్రవేశించుచున్నాఁడు.)

రాయ—(సంతోషాద్భుతములతో) ఏమీ! సోదరా! సంపూర్ణవిజ
యుండవై వర్ధిల్లుచున్నావు. మిగుల నాయాస మందితివి. ఈత
ని విడువుము. మన యెదుటఁ బడి యెందుఁ బోఁగలఁడు?

యాచ—(జగ్గరాయని వదలుచున్నాఁడు.)



రాయ—(విఱిచి కట్టుచున్నాఁడు.)

యాచ-దురాత్మా! జగ్గరాయా! ప్రాణభయము లేదు. భయపడకుము!

జగ్గ—పౌరుషవంతులకు ప్రాణములు తృణప్రాయములుగదా!

యాచ—ఓహో! చండాలవాటినుండి వేదఘోషలు వినవచ్చుచున్నవి!
ప్రాణభీతియే లేకున్నఁ బాఱిపోవు టేల?

జగ్గ—కాలము ననుసరించి నడువవలయును.

రాయ—ఇప్పటికి బుద్ధి వచ్చినదా?

జగ్గ—బుద్ధి లేకున్న చేయునదేమి?

రాయ—రోదనము.

జగ్గ—అది మీరింతవఱకు ననుభవించి విడిచినదే కద!

రాయ—చీ! రోదనము చేయువారు ఎత్తి వత్తురా! ఆరోదనమునీపనియు.
పాపాత్మా! చావునకు తెగించి కాఱు లఱచుచున్నావు.

జగ్గ—చావునకు తెగించుటవలననే గ్రుడ్డిదెబ్బగా గెలుపుదొరకినది.

యాచ—(కోపముతో) పరాక్రమమువలనఁ గాదేమి?

జగ్గ-పరాక్రమ మడఁగియుండునది కాదు. అది మొదటనే వెలువడును.

యాచ—వెలువడ లేదా?

జగ్గ—ఆ! దొంగతనముగా—

యాచ—ఛీ! స్వప్రభుప్రాణమారణదారుణక్రియాచరణమహాపాతకీ!
ఇది దొంగతనమా? దొరతనము గాదా?

సీ. జన్య మిచ్చెదవో? రా ♦ జ్యం బిచ్చెదవో? యంచుఁ
దొలుత నేఁ దెల్పుట ♦ దొంగతనమొ?
సార్వభౌమాన్వయ ♦ సంస్థాపనమునకై
దుర మొనరించుట ♦ దొంగతనమొ?
కనులార నీవు క ♦ న్గొన భవత్ప్రముఖయో

ఘల నుఱుమాడుట ♦ దొంగతనమె?
నిదురించుతఱి మమ్ముఁ ♦ బొదివిననీయట్టి
దొంగను బట్టుట ♦ దొంగతనమె?
మునుపు నిండినసభలోన ♦ నినునియెదుట
ధర్మహితపద్ధతిని శప ♦ థంబుఁ జేసి
తుదకు నెగ్గించుకొనుటయు ♦ దొంగతనమె?
దోర్బలము పేర్మి విజయంబు ♦ దొంగతనమె?

జగ్గ—ఇప్పు డేమనుకొన్నం జెల్లును.

రాయ—సోదరా! ఈనీచసేవాపరాయణునితో నేమి?

జగ్గ—ఒకయుద్యోగమున కొకనీచసేవ యొకప్పుడు తటస్థించుచుండును. సమయము వచ్చినప్పుడు చాకలివానిసహాయముకూడఁగా వలసియుండును.

రాయ—చీ! చీ! రాజద్రోహీ!

సీ. లేనికారణముఁ గ ♦ ల్పించి రారాజును
గార బంధించిన ♦ కపటబుద్ధి!
హీనవంశజునిదా ♦ హిత్రుం డనుచు నెంచి
దారఁ జేసి కొల్చిన ♦ దుర్విదగ్ధ!
సార్వభౌమాంకుని ♦ సకుటుంబముగఁ గట్టి
కత్తిపాల్సేసిన ♦ కఠినహృదయ!
పోర నోపక పాఱి ♦ పోయి దొంగతనాన
నఱుమంగవచ్చిన ♦ పిఱికిపంద!
మానవాధమ! దుర్మతి! ♦ మానహీన!
రాజపశువ! దుశ్చారిత్ర! ♦ ప్రజలచేతఁ
దిట్టునడి యెన్నఁడో చచ్చి ♦ నట్టులుండ



కిట్టిమొండితనముఁ బూని ♦ తేర! జాల్మ!
ఇఁక నీమొగసిపాటు విడిచి కుమారచిక్కని నెందు దాఁచితివో చెప్పుము.

జగ్గ—ఉన్నచోటనే.

రాయ—ఎచ్చట?

జగ్గ—అది నీకే తెలియును.

రాయ—నీ వెఱుఁగవా?

జగ్గ—ఇట్టికుతంత్రముల నెన్నియో నేర్చియున్న మిమ్ముఁ జాలకాలము నుండి యెఱుఁగుదును. కుమారచిక్కని మీ రపహరించినట్లు స్పష్టముగ నెఱుఁగుదును.

రాయ—(తనలో) ఏమీ! ఈతఁ డిట్లనుచున్నాఁడు! ఇది మొండి తనమా? (ప్రకాశముగా) జగ్గరాయా! సత్యము చెప్పవఱకు విడువము.

జగ్గ—సత్యమో అసత్యమో మీయంతరాత్మకే తెలియును.

యాచ—అటులయిన నీయర్ధరాత్రమున నేల వచ్చితివి?

జగ్గ—కుమారచిక్కని వెదకుటకు—కాననిచో నినుఁ బొరిగొనుటకు—

యాచ—మాదౌవారికు లేమైరి?

జగ్గ—వారు నాసహాయులం దఱిమికొని పోయిరి. కాలవశమున నేను నీచేఁ జిక్కితిని.

యాచ—నీసహాయు లెందఱు?

జగ్గ—పదుగురు.

రాయ—అయ్యో! పాపము దౌవారికుల కెట్టిపాటు వాటిల్లెనో కదా!

(దౌవారికు లిరువురు ప్రవేశము.)

దౌ—జయము! జయము! యాచశూరేంద్రా! తిమ్మరాజు ప్రచండ

వాహినితోఁ గుమారచిక్కని దనయేనుఁగుపై నిడుకొని యుద్ధ
మునకు వచ్చుచున్నాఁడు.

జగ్గ—(తనలో) ఏమీ! ఈతిమ్మరాజు విపరీతవర్తనము గలవాఁడుగా
నున్నాఁడే! ఇపుడు మఱల నాకు సహాయముచేయ వచ్చుచు
న్నాఁడా? చూతము.

యాచ—ఏమేమి!

చ. అనఁగ వినంగ రానిపలు ♦ కక్కట! యొక్కటఁ బుట్టిఁ దిమ్మరా
జు నయము వీడి నీచకుల ♦ జుఁ బ్రభుఁ డంచును నాత్మవాహనం
బునఁ దనచెంగటం గడు ప్రి♦మోదము మీఱఁగ నిల్పి తాను యో
ధునిగతి మమ్ములం జెనక ♦ దోర్బల మేర్పడ నేఁగుదెంచెనే?

రాయ—(కోపముతో)

శా. రానీ చూతము వానివిక్రమము నా♦రా! యాచశూరేంద్రభూ
మీనాథాగ్రణిశక్తిపాంత రవిర♦శ్మిం గన్నధ్వాంతంబుచం
దానన్ రూపఱకుండ నుండఁగలదే? ధర్మంబుఁ బోనాడి యి
స్సీ! నీచాత్ములఁ గొల్చువారల జయ♦శ్రీ యెట్లు చేపట్టెడిన్?

సోదరా! ఈతనిచర్య యతివిచిత్రముగ నున్నదిసుమా! మొ
దటఁ దా నుభయపక్షంబులకుం దటస్థుఁడై యుండి య్యేకార
ణంబుననో న్యాయైకమతివలె నటించి కపటస్నేహంబుఁ జూపి
వీరనారాయణు నకారణముగఁ జంపించెను. ఇప్పుడు నీచుఁ డ
గుకుమారచిక్కని కులహీనుని దనయేనుంగుపై నిడుకొని మన
పై దాడివెడలి వచ్చెను. ఇవి యన్నియుం జూడ నితనికి మొద
టనుండియు దురుద్దేశము కలిగియున్నట్లు స్పష్టమగుచున్నది.

గీ. అకట! గోముఖవ్యాఘ్రుఁడై ♦ యడరునితని
మన మపేక్షించితిమయేని ♦ మారిమసఁగి



ఆలమందలగతిని బ్ర♦జాళి నేర్చి
సాధుసంతాపమును గూర్పఁ ♦ జాలుఁ గాదె!

యాచ—ఏమీ! ఆతఁ డిట్టియాశ్చర్యకర మగుకపటప్రయత్నముకల
వాఁడా?

రాయ—కాకేమి? ఇది యంతయు జగ్గరాజుమాయలో మడఁగియున్నది.

యాచ—అది యెట్లు?

రాయ—మీవలన యుద్ధములోఁ దన కపజయము సంభవించు ననున
మ్మకముతోడనే కుమారచిక్కని భూగృహమునుండి సురక్షితము
గాఁ గొంతసేనతో నీతిమ్మరాజునొద్దకీజగ్గరాజు పంపియుండును.
ఇతడు మనల జయించుతలంపున నిజసేనలతో నెత్తివచ్చియుం
డును.

యాచ—(జగ్గరాజుం జూచి) ఇది యథార్థమేనా?

జగ్గ—యథార్థ మని యెవ్వరు చెప్పఁగలరు? అది దైవమున కెఱుక.
(తనలో) కుమారచిక్కనిపోబడి వీరికిఁగూడ నగ్రాహ్యమేమై
నదా? ఎవ రట్లు చేసియుందురు?

రాయ—ఏమి నీనిగూఢవాక్యములు! చచ్చునప్పుడైన సత్యము చె
ప్పరాదా?

జగ్గ—ఒకప్పుడు చెప్పకుండినయెడలఁ గాదా?

యాచ—సోదరా! పరిభవదవానలంబున వేగుచున్నయాతని నేల పీ
డించెదవు? మనము ప్రత్యక్షముగనే చూడనై యున్నారము
గదా!

రాయ—ఇపుడు మనమొనలం దీర్చి తగుజాగ్రతలో నుండవలయును.
సర్వమును సన్నాహము చేసెదను.

(అని నిష్క్రమించును.)

తెరలో

ఉ. సైనికులార! మీర లల ♦ సత్వముమాని నిజప్రయోజనం
బై నదురంబు సేతకుని ♦ జాయుధవర్గముతోడ నేర్పుమై
నీనిశయందు భవ్యముగ ♦ నేలికచిత్తమువచ్చునట్లుగాఁ
బూనిచరింపఁగా వలయుఁ ♦ బోర విరోధులు గ్రమ్మఱించుటన్.

యాచ—అదిగో! రాయపతిసేనాసముదయమును హెచ్చరించుచున్నాఁడు. (ఖడ్గమును సవరించుచు)

ఉ. ఓకరవాలమా! జరుగ ♦ నున్నది పోరిదె! క్రమ్మఱంగ నీ
యాఁకలి దీఱునట్లుగ మ ♦ హాహవకేళి విరోధిరక్తముల్
భీకరలీలఁ ద్రావి యల ♦ భీము త్రిశూలముకైవడిన్ జయ
శ్రీకునిఁ జేసి మత్ప్రియముఁ ♦ జేయుము నిన్ను సమాశ్రయించితిన్.

తెరలో

ఉ. ఏయెడ! యాచశూరవిభుఁ ♦ డేయెడ! నేయెడ చెప్పు డిప్పుడే
నాయనఘాత్మునిం గలియ ♦ నంతకుఁ దోఁపకయుండె; శౌర్యముం
బాయనిశాంతమూర్తి యరి ♦ వారము పోరెడిపట్ల దేహముం
దాయని యేకవీరుఁ డతి ♦ ధార్మికుఁ డాయనఁ గాంచ నెంచితిన్.

యాచ—(ఆలకించి) తిమ్మరాజుగాఁబోలును! నన్ను వెదకికొనుచునీవంకనే వచ్చుచున్నాఁడు. ఇఁక నూరకుండరాదు:

శా. రమ్మీ! వేగమ యాచశూరుఁ డిదె సం ♦ గ్రామార్థియై శాతఖ
డ్గమ్ముం గైకొని వక్రిగాములకు వ ♦ క్రత్వంబు మాన్పించి ధ
ర్మమ్ముం జూపుచుఁ గింకరోత్కరముగాఁ ♦ గావింప నున్నాఁ డిటన్
రమ్మీ! తిమ్మనృపాల! నీయభిమతా ♦ ర్థం బిందుఁ జేకూరెడిన్.

తిమ్మ—(ప్రవేశించి) యాచశూరా! నీకు సుఖమేకద!

యాచ—అరినిశ్శేషంబు గాకుండ సుఖ మెక్కడిది?.



తిమ్మ—ఇఁక స్వస్థత గలుగును.

యాచ—(క్రోధముతో) తిమ్మరాజా!

క. ఏనో నీవో స్వస్థత
గా నుండఁగఁ జెల్లుఁ గాని ♦ కపటాత్మక! నీ
వీనయము లెల్లఁ జూపుట
యేనెఱుఁగనె కల్లవినయ ♦ మేలా యింకన్?

గీ. నీచుఁ బట్టపుటేన్గుపై ♦ నిలిపికొనుచు
వచ్చి ననుఁ గాంచి యిట్లీవు ♦ పలుకఁ జెల్లు
నిజ మెఱింగియు నేను మ ♦ న్నిశితఖడ్గ
ధార నిందాఁక నీమెడఁ ♦ దఱుగ కునికి.

దురాత్మా! కాచికొనుము. రక్షింప నెవ్వ రడ్డము వచ్చెదరో చూతము. (అని కత్తి నెత్తుచున్నాఁడు.)

(వినయంధరుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విన—(ఇరువురినడుమ నిలిచి) ఏమిది? అరిరాజన్యశిరఃకర్తనలీలాలోలం బగుయాచశూరభూపాలునికరవాల మిప్పుడు మిత్రమారణంబున కుపయోగపడుచున్నది?

జగ్గ—(తనలో) చచ్చినవినయంధరుఁడు మఱల నెట్లు వచ్చెను జెపుమా!

యాచ—(నివ్వెఱపడుచున్నాఁడు.)

తిమ్మ—యాచశూరేంద్రా! ఏల యిట్లు నివ్వెఱపడియెదవు? శత్రుమధ్యంబున నున్ననీకు మిత్రామిత్రనిరూపణంబుచేయుట దుర్ఘటముగదా! కొంచెము పొరఁబడితివి. ప్రమాదము లేదు.

యాచ—నే నిప్పుడు కల గనుచుంటినా?–నిదురవోవు చుండలేదే!–నిజముగాఁ జూచుచునే యుంటిని. ఆహా! నాకనులనే నేను నమ్మలేకున్నాను. ఈయన నిజముగా మిత్రరత్న మగునార్యవిన

యంధరుఁడేనా? లేక మమ్మిరువురఁ బ్రదికింపవచ్చినభగవానుఁ
డా? ఏమి యీయాశ్చర్యము! తిమ్మనృపాలా! ఈతఁ డార్య
వినయంధరుఁడేనా? సత్యము వచింపుము!

తిమ్మ—(నివ్వెఱపడుచున్నాఁడు.)

విన—మహాత్మా! ఏమి యిట్లనుచున్నావు? నావంకఁ జూడుము! నే
ను నీతో సార్వభౌమునెదుట మాటలాడిన నీమిత్రుఁడ నగువిన
యంధరుఁడను గానా? నీ కీసందియ మేల కలుగవలయును?

యాచ—సత్యముగ నేను నమ్మలేకున్నాను. ఈరాత్రివేళ నేమాయా
శక్తియో నన్నిట్లు కలఁత నొందించుచున్నది. కానియెడల
రాజభక్తికై తనయసువులఁ దృణప్రాయముగ నొసంగిన మిత్ర
శిఖామణి యగువినయంధరుఁ డిప్పుడిటకు వచ్చి నాతో మా
టలాడుట యెట్లు పొసఁగును?

జగ్గ—(తనలో) ఇది యంతయు మాయగానే యున్నది. ఈముసలి
ముండకొడుకు కడు జిత్తులమాఱిగ నున్నాఁడు!

తిమ్మ— ఆర్యవినయంధరా! ఏమి యీతనిమాటలపోలిక యసంబంధ
ముగ నున్నది?

విన—నృపాలా! ఈయనఘునిచిత్తవైకల్యమునకుఁ గారణము లేకపో
లేదు. నేను చంద్రగిరి విడిచినట్లూరు లెఱుంగకుండ నీకడ క
రుదెంచుతఱి వేంకటదాసుమూలమున వినయంధరుఁడు చంపఁ
బడె ననుప్రవాదముం బుట్టించితిని. అది యీమహాత్ముఁడు నిజ
ముగాఁ గైకొని యిట్లు కలఁతనొందుచున్నాఁడు.

జగ్గ—(తనలో) ఓరిదురాత్మా! వెంకటదాసా! నీవు నిజముగా విన
యంధరునిఁ జంపినవాఁడవే యని నమ్మి నీయెడ నెంతనమ్మకము
కలిగి యుంటినిరా! ఛీ! ఛీ! కపటశీలా! “నోసలుబత్తుఁడును



నోరుతోఁడేలును” అనుసామెత నీయెడ సార్థక మగుచున్నదిరా?

యాచ—(సంతోషాద్భుతములతో) ఆఁ! ఆవదంతియు భవన్మతివిశే
షముననే కలిగినదా! అట్లయిన నేను ధన్యతములలో నుత్త
మోత్తముఁడను. నేఁడు నాప్రాణమిత్రునికనులారఁ జూచుచు
న్నాను! (అని కౌఁగిలించును.)

విన—(సంతోషముతో) యాచశూరేంద్రా! మనకు విజయము చే
కూఱినది.

యాచ—అది యెట్లు? కుమారచిక్కఁడు—

విన—తిమ్మనృపాలుని బాహుబలమూలమున నీపాదదాసుఁడైనాఁడు.

తిమ్మ—కాదు. ఆర్యవినయంధరుని రాజనీతినైపుణ్యమున—

జగ్గ—(తనలో) నే ననుకొన్నట్లే యయినది. తిమ్మరాజున కీపోఁగాల
మేమి?

యాచ—మీమాటలు నాకు మఱియు మఱియు నాశ్చర్యముం గలి
గించుచున్నవి. తిమ్మరాజు జగ్గరాజుపక్షమున రాలేదా? అట్లు
గాకున్న కులహీనుఁ డగుకుమారచిక్కని నేనుఁగుపై నిలుపుకొ
ని రా నేల?

విన—(నవ్వుచు) ఏనుఁగుపై నున్నయతనిం జూచి జగ్గరాజు సేనలు
తిమ్మరాజు తమపక్షముననే యుద్ధము చేయవచ్చె నని యుపే
క్షించుతఱి మేము సురక్షితముగ మనసేనలలోఁ గలియవచ్చు
ననియట్లు యుక్తి పన్ని వచ్చి విజయుండ వగుసిన్నె కాంచి కృ
తార్థుల మైతిమి.

జగ్గ—(తనలో) ఏమి యీయసహాయశూరత్వము!

యాచ—ఇప్పుడుగదా! నేను నిజమైనయానందము ననుభవించు
చున్నాను.

చ. కనుఁగొన నిన్నువంటిచెలి ♦ కానిజగంబున నెందుఁ గాంతు నీ
యనుపమయుక్తిచేత నెక ♦ దా పగవారి జయించి లోక మిం
పునఁ గొనియాడ రాజ్యరమ ♦ పూర్వనృపాలునివంశమందు నే
ర్పునవెలయింపఁ గల్గినప్ర ♦ మోదము నొందఁగ నయ్యె నియ్యెడన్.

చ. అదియును గాక తిమ్మవిభు ♦ నంతటిధీయుతుతోడ సఖ్యముం
గదిరె; సుమిత్రిజాతకుతు ♦ కంబున నేఁడు జయాభిరామతన్
బొదలితి; జైత్రిలక్ష్మి ననుఁ ♦ బుణ్యము పేర్మి రసోదయాకృతిన్
గదిసె; మహాత్మ! నీయమిత ♦ కారుణికత్వమహత్త్వసంపదన్.

తిమ్మ—మహాత్మా! యాచశూరేంద్రా! నీవు సత్యవాక్యధురీణుఁడవు. నీ వనిన ట్లీమహాత్మునిమూలముననే మనకు సర్వశుభములు వాటిల్లినవి.

యాచ—ఆర్యా! కుమారచిక్కఁడు మీ కెక్కడఁ జిక్కెను? అతనిఁ దగుసేనలతో నీజగ్గరాజు సురక్షితముగ నుంచె నని వింటిమే!

విన—అది యంతయుఁ గల్ల. దీనిగొడవచాలగా నున్నది. రజకునిదుర్మరణము విన్నపిదప నేను చంద్రగిరియం దుండరోసి వేంకటదాసును రప్పించి యాతనితో భద్రముఖాదులం గైకొని శత్రునిర్యాణంబు గావించుతెఱం గాలోచింపు చుండు మని కట్టడిచేసి బయలుదేరి ఆరాత్రి కొకపల్లెఁ జేరితిని. అందొకబ్రాహ్మణుఁడు—ఆహా! పావనులచరిత్రము స్మరణకు రావేగమే మై పులకరించు చున్నది!—యజ్ఞశర్మయనువానియింట నారాత్రి నివసించి యాదంపతు లొనర్చునాతిథ్యముం గైకొని సేదదేఱి కతిపయదినంబులకుఁ గొండవీడు చేరితిని.

జగ్గ—(తనలో) ఔరా! వెంకటదాసా! ఆదురాత్ములకు మొనగాఁడవై చక్కెరపొదిఁగినవిషఘుటికవలె నాయొద్ద మెలఁగితివా?



యాచ—తరువాత!

విన—అనంతరము తిమ్మవిభుంజేరి యీజగ్గరాయనిదుండగములం జెప్పి నాఁటి కొకయుపాయ మాలోచించి వీరనారాయణుని కట్లు లేఖ వ్రాయించితిని. అది వృథయై పోయినసంగతియంతయు మీకుఁ దెలిసినవిషయమే.

యాచ—నీవా యట్లొనరింపించినది? అది యంతయుఁ గడచినది. తరువాత!

జగ్గ—(తనలో) ఓరివృద్ధజంబుకమా! ఎంతపని చేసితివిరా! కొండెములమారీ!

విన—పిమ్మట నీజగ్గరాజు చిక్కభూపాలుని సకుటుంబముగాఁ జెఱలోఁ జంపి తన కెదురు లేదని మై మఱచియున్న యొకనాఁటిరాత్రి అదివఱకే కుమారచిక్కనిశయ్యాగృహముక్రిందికి సొరంగము త్రవ్వియున్న భద్రముఖాదులసాహాయ్యమున వేంకటదాసు తరుణ మరసి సొరంగముగుండ శయ్యాగృహముం బ్రవేశించి కుమారచిక్కనిం బట్టి కట్టి గుప్తముగా నొకయరణ్యమునఁ బెట్టెను.

యాచ—మేలు! మేలు!! తరువాత—తరువాత—

జగ్గ—(తనలో) ఏమి యీదుర్నయము! ప్రక్కలో బల్లెమువలె వీఁడెంతపని చేసెను! వీని నమ్మి కుమారరక్షణమునకై నియోగించిన నాయవివేకముచే నింత మునిఁగినది. ఇంతకును విధివిధాన మిట్లున్నది. ఏమనుకొన్న నేమి?

విన—అంతటఁ జిక్కవిభుని బలవంతముగాఁ జంపిన క్రోధంబున దండనాయకులు కొందఱు జగ్గరాయని దుర్నయమునకు రోసి మీతోఁ గలియఁగా మీ రెత్తివచ్చుచున్నా రని యాతఁడెఱింగి కుమారచిక్కఁడు పరులచే నపహరింపఁబడె ననిసఁ దనకు మోస మ

గు నని తాను జాగ్రతగా నతని నొకచోట దాఁచితి నని లోక
మున వాదు పుట్టించి యది మఱింత బలపఱచుటకై వానిని
వెదుకఁ బంపెడు సేనలను వానిరక్షణమునకై పంపుచున్నాన ని
కూడఁ బ్రకటించెను.

యాచ—ఆహా! జగ్గరాజా! నిజముగ నీవే రాజనీతివిదుఁడవు—తరు
వాత!

జగ్గ—(తనలో) ఏమైన నేమి? ఇట్టియవస్థకు వచ్చితినిగదా!

విన—తరువాత మీ రీజగ్గరాజుపై కెత్తి వచ్చుచున్నా రని మాకు తె
లియవచ్చినది. మేమును సేనలతో బయలుదెడలి వచ్చు చుం
డఁగా మార్గమధ్యమున నరణ్యములో జగ్గరా జంపినసేనలు భ
ద్రముఖాదుల నొంచి కుమారచిక్కని విడిపించుకొని పోఁజూచు
చుండ నింతలో మేము గలిసికొని సంగతి యామూలాగ్రముగ
దెలిసికొని యాసేనలం బరిమార్చి యాతనిం గైకొని యిం దరు
దెంచి జయభద్రుండ వగునిన్నుఁ గాంచి ప్రమోద మందఁగలి
గితిమి.

గీ. ఘనులు తమపూన్కి నెఱవేర్పఁ ♦ గలుగుదాఁక
నెట్టికష్టంబు లైన స ♦ హించి ధైర్య
రమయ సాహాయ్యముగ యుక్త ♦ సమయమందు
నభిమతార్థంబు గాంత్రు నీ ♦ యట్టు లనఘ!

యాచ—సంతోషము! సంతోషము! మిత్రరత్నములారా! మేనము
కృతార్థుల మైతిమి. ఇఁక ముందు శ్రీరంగరాజకుమారుని పట్టా
భిషేకకార్యంబు లాలోచింపవలసి యున్నది.

విన—అవును. కాని, దానికి ముందొకశుభము. (అని చెవిలోఁ జెప్పును.)

యాచ—(సంతోషముతో) మహాత్మా! నీయభిమతమునకు వేఱొం



డు గలదా? అది తిమ్మప్రభునిమూలముననే నెఱవేఱవలసియు
న్నది.

తిమ్మ—నన్ను మీకంటె వేఱుగాఁ జూచుకొనఁజెల్లునా? మన కెల్లరకు
ను మనసొక్కటియే యైనదికదా!

యాచ—(మిన్నువంకఁ జూచి) తెల్లవాఱ వచ్చుచున్నది. తరువాతికృ
త్యములయందుఁ బ్రవృత్తులము కావలయును—ఎవ రక్కడ

సేవ—(ప్రవేశించి) అయ్యా! ఏమి సెలవు?

యాచ—నీ వీజగ్గరాయనిం దీసికొనిపోయి మనశిబిరమున నుంచి జాగ్ర
తగాఁ గాపాడు చుండుము. ఈశుభవార్త మనరాయభూపాలు
నకుం దెలిపి యుద్ధసన్నాహంబు వారింపు మనుము.

సేవ—చిత్తము. (అట్లు చేయును.)

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.



శ్రీ

# యాచశూరేంద్ర విజయము.

అను

# శ్రీరంగరాయపట్టాభిషేకము.

## సప్తమాంకము.

రంగము—రాజభవనపరిసరము.

(యజ్ఞశర్మ యను బ్రాహ్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

యజ్ఞ—ఆహా! ఏమి నాభాగ్యము!

గీ. ఎచటివినయంధరుండు మా ♦ యింటివిందు
కావుటేమిటి కాదయా ♦ కలితువలన
నే కదా నేను నృపపురో ♦ హితుఁడ నగుట
సాధుసేవన మైశ్వర్య ♦ జనక మహాహా!

గీ. పూర్వ మొకరాత్రి శ్రీమంత ♦ భూమిపాలు
నాదరించినపేదబ్రా ♦ హ్మణుఁ డొకండు
తనర శ్రీమంతుఁ డగుటఁ; జి ♦ త్రంబు గాదు
పతిహితునిచేతఁ గన్న నా ♦ పదవి తలఁప.

ఆర్యవినయంధరా! నీ వెట్టిమహిమాఢ్యుఁడవు!

చ. అసమయసంధు తాము ధర ♦ యందున లేనియటుల్ మెలంగుచుం
బొసఁగినవేళ సర్వమయు ♦ పోలిక నిండుగ భూతధాత్రి నే



దెసఁ గనుఁగొన్న నైజకృత ♦ ధీబలశక్తియె కానిపింపఁగా
మసలుదు రౌర! సూరిజన ♦ మాన్యులు సన్మహిమానుభావ్యులై.

గీ. అల్పుఁ డధికారమంద మి ♦ న్నంది తుదకు
గాలివానకుఁ జెనుమ్రాను ♦ కరణి ధరణి
మూలవిచ్ఛేదమును బొందు ♦ మొదల దీనిఁ
దలఁప జగ్గరాయండె ని ♦ దర్శనంబు.

ఔరా! తనయమీఁదియనురాగంబున నాఁగాము లరయకయొక్కనీచుని మనుమం డనిప్రకటించుటయె కాక వానికి నిజపౌత్రి నొసంగి తద్రాజ్యసంధానంబునకై చేయరానిపను లెల్లం జేసి తుట్టతుద కమాయకుం డైనచిక్కరాయని సకుటుంబముగాఁ జంపించిన తనయకృత్యంబు ఫలింప యాచశూరేంద్రునిచేఁ బట్టువడి తొల్లింటిక్రూరకృత్యంబులం దలంచికొని తనువురోసియో తన కెట్లును జావు నిశ్చయ మనియెంచియో జగ్గరాయం డాత్మహత్య గావించుకొనియెను. వానిహితుండైన పూర్వపురోహితునిం దీసివైచుటచేత నే కదా నా కీయాశ్రయము లభించినది. ఇది యంతయును వినయంధరునిబుద్ధివైభవము కాకున్న వేంకటపతిరాయలమేనత్తకుమారుండును గొండవీటిదుర్గాధ్యక్షుండు నగుతిమ్మరాజును స్వాధీనుం జేసికొని యారాజుమూలమునఁ గుమారచిక్కని చిక్కించుకొనుటయే కాక యెన్నెన్నియో మహాత్కార్యంబు లొనరింపఁ జేసి తుద కాతనిపుత్త్రునిపుత్త్రిక నీశ్రీరంగరాయకుమారున కిచ్చునట్లొనర్చి నలువలంకుల నల్లుకొనుచున్నతననీతివల్లికకు ఘనతరుం డగు శ్రీయాచశూరభూపాలునిబాహుశాఖ యాధారంబుగా వైవాహికకార్య మెట్లొనర్పఁగలుగును? ఆహా! ఆచిన్నిదంపతులం గన్ను

లపండువుగఁ గాంచువారిభాగ్యమే భాగ్యము.

సీ. సరవి సహస్రిలో ♦ చనదర్శనీయులై
విబుధప్రమోదాబ్ధి ♦ వృద్ధిఁ గూర్చి
గురుతరకల్యాణ ♦ గుణసముపేతులై
గజముఖపూజనో ♦ త్కంఠఁ దాల్చి
వేంకటగిరినాథ ♦ విపులకృపాపాంగ
దృగ్విలాసమున వ ♦ ర్ధిల్లుచుండి
మహిమాఢ్యులై సర్వ ♦ మంగళాశాసనం
బులఁ దలఁ దాల్చి ప్ర ♦ మోదమంది
అలరుదేవసేనాకుమా ♦ రులను బోలె
వెలయుమారాజదంపతుల్ ♦ విశ్వహితము
నెరపి శంకరకింకరో ♦ త్కరముగొలువ
లీలఁ జిరకాల మవనిఁ బా ♦ లింత్రుగాక!

ఆవినయంధరునిదయచేఁ దత్పరిణయంబున నాకు భాగ్యము ల
భియించినది. నేఁడు పట్టాభిషేకమహోత్సవము కదా నాపుణ్య
మినుమడించినది. ఓలక్ష్మీ! నీక్రేఁగంటిచూపులచే నన్ను నిరం
తరము ననుగ్రహింతువు గాక! (ప్రొద్దువంకఁ జూచి) ఓహో!
పట్టాభిషేకముహూర్తము సమీపించినది. (కొన్నియడుగులు
నడచి) ఆహాహా!

సీ. శోభనమూలల మా ♦ చూతపల్లవతోర
ణంబుల ద్వారదే ♦ శంబులలర!
మంగళప్రదము లౌ ♦ రంగవల్లికలఁ జి
త్రింబులఁ బ్రాంగణ ♦ స్థలములమర
నామోదకలితంబు ♦ లగు తేటపన్నీటి



కలయంపులెల్లెడఁ ♦ గ్రందుకొనఁగఁ
గౌతుకారంభసం ♦ కలితతూర్యధ్వనుల్
బురుజుల నొక్కట ♦ భోరుకొనఁగఁ
బ్రథితపట్టాభిషేకకా ♦ ర్యప్రయుక్త
హృదయవేగయాతాయాత ♦ నృపవరప్ర
చారరాజమార్గం బిది ♦ సంతసంబు
వెల్లిగొలిపెడు నాచిత్ర ♦ వీధి కహహా!

ఓహో! ఈపురలక్ష్మి యలంకారవిశేషములచేతనే కాక శ్రీరం
గరాయపట్టాభిషేకసంజాతకౌతూహలంబునం దనసహజరామ
ణీయకంబు నెఱపుచుఁ గన్నులపండువుగా నున్నది. (పైవంకఁ
జూచి) అదిగో! ఎల్లెడల బంగారుసౌధములపైఁ బురస్త్రీలుగుం
పులుగుంపులై శృంగారదేవతలవలె వెలయుచున్నారు. ఆహాహా!

సీ. బాలికాతరళదృ ♦ గ్జాలంబు లెదురేఁగి
తలిరుదోరణముల ♦ తమ్ము లయ్యెఁ
దరుణీజనస్తన ♦ స్తబకంబు లుప్పొంగి
పన్నీటికుండల ♦ యన్ను లయ్యెఁ
బ్రౌఢకాంతాతను ♦ ప్రభ లేచి మేడల
పైఁడిపూతలతోడు ♦ నీడ లయ్యె
లోలాంగనామంగ ♦ ళాలాపములు చేరి
తొలుబల్కురొదలపై ♦ దోడు లయ్యె
నహహా! శ్రీరంగరాయప ♦ ట్టాభిషేక
సమయసంతోషసమ్మద ♦ సంభ్రమావ
లోకనంబులఁ బౌరకాం ♦ తాకులంబు
లధిపుదర్శింప భర్మహ ♦ ర్మ్యముల నిలువ.

(పరిక్రమించి) ఓహో! ఈవంక వారాంగనలు మూర్తీభ
వించినశృంగారరసాధిదేవతలవలె సరసజనహృదయాకర్షణంబు
గావించుచున్నారు. మేలుమేలు!

సీ. మరియాద గాక య ♦ త్తరుఁ జిల్కు లేల యీ
పూఁబోండ్లమైతావి ♦ పొలయుచుండ
వాడుక గాక క ♦ ప్రపుఁబల్కు లేల యీ
నెలఁతలదరహాస ♦ మొలయుచుండఁ
దలతిక్క గాక వీ ♦ ణెలమీటు లేల యీ
మధురవాణులపల్కు ♦ మలయుచుండ
నాచారమే కాక ♦ వ్యజనంబు లేల యీ
కొమ్మలపయ్యెదల్ ♦ గులుకుచుండ
ననుచుఁ దత్తద్విశేషంబు ♦ లరసికొనుచు
సరసు లానందపారవ ♦ శ్యంబు నొంద
సారసంగీతనృత్తశృం ♦ గారగతుల
రాజిలుచునుండె వారనా ♦ రీజనంబు.

(దిశ లాలకించి)

చ. మలయుచుఁ దావులం జిలుక ♦ మారుతముల్ వెదజల్లెడిన్; దిశా
వలి దెలివొంది యుండెఁ; దరు ♦ పంక్తులఁ గోకిలకాకలీస్వనం
బు లెసఁగె; నింగి నీలమయ ♦ మూర్తి వహించి వెలుంగుచుండె; మం
గళకరుఁడై సిరంగపతి ♦ స్నానతిఁ గైకొను నేఁ డవశ్యమున్.

(అని నడచుచున్నాఁడు)

తెరలో

చ. బలియుర శత్రులం గెలిచి ♦ పార్థివవంశము నిల్పి భూమినే
తలను గుమారరంగనికి ♦ దాసులగా నొనరించి భూప్రజల్



చెలఁగి నుతింపఁ జంద్రగిరి ♦ సింగపుగద్దియఁ బట్టభద్రుఁగా
నిలిపెదు యాచశూరపతి! ♦ ని న్నొగడంగఁ దరంబె? సత్కృతీ!

యజ్ఞ—(ఆలకించి) ఓహో! కొలువుకూటంబున కెల్లరును విచ్చేసిరి.
అదె వైతాళికులు యాచశూరభూపాలుని కైవారములు చేయు
చున్నారు. ఆలసింప నేల? నేనును బోయెదను. (అట్లుచేయును.)

అంతఁ దెర యెత్తఁగఁ గట్టఁబడియున్న చిన్నచిక్కఁ
డును, యాచశూరుఁడు, వినయంధరుఁడు, తిమ్మరాజు
వేంకటదాసు, దండనాథులు మొదలగువారితోఁ గు
మారశ్రీరంగరాయలు ప్రవేశించియుండును.

యాచ—చ. వెలయఁగలారె భూస్థలిని ♦ వేంకటదాససమానవిజ్ఞు లీ
యలఘుఁడె కాదె శత్రులకు ♦ నాప్తులకుం దగనొక్కరూపుగా
మెలఁగి విరోధిరాజును ని ♦ మేషమునన్ దఱివేచి పట్టి త
త్ఫలముగఁ బట్టభద్రుఁ డగు ♦ స్వప్రభుదారకు గాంచగల్గుటన్

వేంక—యాచశూరభూపాలా! సేవకుల కది ధర్మమే కదా! దానికై
న న్నింతస్తుతియింప నేల? తా మొనర్చినదానిలో నిది యేపాటి?
భవదీయబుద్ధిబలవైభవంబె కదా మమ్మింతవారిం జేసినది.

ఆ.వె. పాపకర్ముఁడైన ♦ బలవద్విరోధి యా
పూటఁ బ్రభుని దార ♦ పుత్త్రిముగను
బందిగమునఁ బెట్ట ♦ భవదీయభుజశక్తి
వలనఁగాదె యింత ♦ వార మగుట!

విన—యాచశూరభూమీశ్వరా! శ్రీరంగరాయకుమారునితోఁపాటు
మేమెల్ల జీవించియుండి యీశుభంబుఁ గాంచఁ గలుగుట భవ
త్కారుణ్యవిశేషంబుననే కదా!

యాచ—వినయంధరా! అట్లనకు మట్లనకుము!

చ. బలిమి సపుత్త్రదారముగ ♦ వైరి యొకండు నిజేశుఁ బట్టి హా!
పలుకఁగ నోరురాని బహు ♦ పాతకపుంబని సేయ వించు లోఁ
గలఁగుచు దుఃఖముం గనుటె ♦ కాని ప్రభుం బ్రదికించుకోన ; యి
ట్లలతిజయంబుఁ గైకొనిన ♦ యంతనె న న్బొగడంగ నేటికిన్ ?

తిమ్మ—యాచశూరేంద్రా! దైవకృత మవిలంఘ్యము గదా! పోయినవారు విచారించిన మఱల వత్తురా? అది యట్లు జరుగవలసి యుండెను.

శ్రీరం—(తల వంచి కన్నీరు నించుచున్నాఁడు)

యాచ—తిమ్మభూపాలా! చూడుము! ఈకుమారుఁ డెట్లుండెనో! ఈ యనఘునిదుఃఖమును మన మెట్లు తీర్పఁగలము?

విన—అయ్యా! అది నిజమే! బంధునాశనమూల మగుశోక మెవ్వరిని క్షోభింపఁజేయకుండును!

తిమ్మ—అది యంతయును గడచినది. దాని నిప్పుడు తలఁపఁదగినసమయము గాదు. ఈకుమారునకుఁ రక్షకుండ వగుటచే నీవే పితృసముఁడవు. నీవలననే యాలోపము తీఱినది.

విన—మిత్రమా! యాచశూరేంద్రా! ఈతిమ్మప్రభునివాక్యములు పరమార్థము నుద్బోధించుచున్నవి.

వేంక—అది సత్యము. తనపాపకృత్యమునకుం దగినట్లు వైరి నిహతుఁ డయ్యెను. తత్పక్షరాజలోకంబును నిర్జింపఁ బడియెను. ధీవరాక్రమశాలి యగుతిమ్మరాయభూపాలుండు మనకు మిత్రుండును విశేషించి కుమారశ్రీరంగరాయప్రభువరునకుఁ బౌత్త్రినిచ్చినచుట్టమును గూడ నయ్యెను. ఇఁక మన మెన్నివిధంబులఁ జూచిన నీకుమారునియభ్యుదయపరంపరలనే చూడవలయును.

యాచ—(తిమ్మరాజుం జూచి)



సీ. వీరవేంకటభూమి ♦ విభునిమేనత్తకు
నసుఁగునందనుఁడ వీవ ♦ గుఱె కాక
శ్రీరంగవిభునకుఁ ♦ జిన్నిపౌత్త్రి నొసంగి
యలచిక్కవిభునివి ♦ య్యంబ వైతి
నీకుమారునిభార ♦ మెల్లను మాకంటె
నినుమడి నొందితి ♦ వెల్లగతుల
నీ వింతవాఁడ వం ♦ చేనుతింపఁగ నేల
సకలంబు నీవకా ♦ జరుపుకొనుచుఁ
దల్లిదండ్రులు లేనియీ ♦ తనయునకును
సర్వమున కీవ యయి మమ్ము ♦ సఖులరీతి
నరసి మన్నించి కూరిమి నెఱపుమయ్య!
ప్రథితగుణధుర్య! శ్రీతిమ్మ ♦ రాజవర్య!

తిమ్మ—అనఘా! గోడ లేనిదే చిత్రము వ్రాయుచుంటిరి గదా! నన్నింతపొగడ నేల? ఇది యంతయును నీదయామహిమమే కదా!

యాచ—ఏల యీ విశేషోక్తి?

విన—కాదు. అది స్వభావోక్తియే యగును.

యాచ—(వినయంధరుని గౌఁగిలించుకొని)

సీ. కారాగృహంబునఁ ♦ గడగండ్లఁ దప్పించి
శ్రీరంగవిభుని ర ♦ క్షించినావు
ధరణి వేఱొకప్రవా ♦ దంబును బుట్టించి
చెలిమిఁ దిమ్మప్రభుఁ జేరినావు
దండనాథులకు సం ♦ తద్వైరములఁ గూర్చి
పగతురఁ గలఁగించి ♦ నెగడినావు
కడఁగి కుమారచి ♦ క్కనిబట్టిబంధింపఁ

గలిగినమిత్రుని ♦ గలిసినావు

గీ. నాఁడు వీరవేంకటభూమి ♦ నాయకునకు
బాస యిచ్చినరీతి నీ ♦ వాసరిలక
చేయఁగలయట్టికార్యంబుఁ ♦ జేసినావు
ఆప్తజనవర్య! యోవిన ♦ యంధరార్య!

న—మిత్రమా! న న్నేల పొగడెదవు? రాజభక్తి కలవారి కిది నైజకృత్యమే కదా! నేనును రాజసేవకకోటిలోనివాఁడనే యగుట నా కట్టిభక్తియుండు టొకయబ్బురము కాదు. నీ వట్టివాఁడవు కావు. ఒకప్రభుశిఖామణివై ప్రచండతేజంబునం దేజరిల్లుచుండిననీవు ఇరువురురాజు లుద్వేగంబునం బోరుచుండఁ గాంచుచు నిరువురుం జెడినపిదపఁ దద్రాజ్యముం గోరఁదగినవాఁడ వయ్యును, అట్టు లాసింపక న్యాయపక్షంబవలంబించి తుదకు విజయుండవై యాశ్రీరంగవిభునితోఁగూడ మమ్మందఱ నేఁ డానందసాగరంబున నోలాడించుచుంటివి. నీయట్టిపరోపకారధురీణులును, ఉదారశీలురును, ప్రకటీకృతశౌర్యులును, ధర్మమార్గసంచారులును న్యాయైకపక్షావలంబులును గలరా? అర్థిజనమందారుండవు. సార్వభౌమునిచేఁ గోరఁబడి యాతనిమాటఁ బాటించి మించిన ధైర్యంబున బుద్ధివైశద్యంబుఁ బ్రకటించి మున్ను శ్రీకృష్ణుండు పరీక్షితుని రక్షించి పాండవవంశమును నిలిపినరీతి నీ శ్రీరంగరాయకుమారునిం గాపాడి చంద్రవంశమును నిలిపితివి, చంద్రగిరిసింహాసనము నుద్ధరించితివి. మహాత్మా! నీకీర్తి యాచంద్రతారార్కమును వర్ధిల్లుఁ గాక!

ఉ. తామరతంపరై నెగడు ♦ తావకవంశము నేఁటినీమహో
ద్దామచరిత్రచేత నుకృ ♦ తంబున సత్ఫల మేలపోవు నీ



భూమిని నెల్లకాలముఁ బ్ర ♦ భుత్వపదస్థితిఁ గాంచుచున్ యశః
కాముకులై మెలంగెదరు ♦ గావుత తావకవంశ్యు లున్నతిన్.

యాచ—మహాప్రసాదము. ఆర్యా! ప్రసంగవశమున మనము ప్రస్తుతకార్యవిలంబము చేయుటలేదు గద!

విన—గురువుగారిరాకకై నిరీక్షించుచుంటిమి.

యజ్ఞ—(సమీపించి) అయ్యా! ఇదె వచ్చితిని.

గీ. సకలజనములమనములు ♦ సంతసమున
నోలలాడుచునుండె నీ ♦ వేళఁ గాదె?
శ్రీకుమారకపట్టాభి ♦ షేకవిధులు
కొఱవడకయుండ నెఱవేర్చు ♦ కొనుట మనకు.

విన—తథాస్తు.

యాచ—పట్టాభిషేకమహోత్సవవిధులు నిర్వర్తింతము.

యజ్ఞ— గీ. మంగళము చిక్కరాయశ్రీ ♦ రంగపతికి;
మంగళము యాచశూరస ♦ మంచితునకు;
మంగళము సర్వసద్గుణ ♦ మండితునకు;
మంగళము చంద్రగిరిరాజ్య ♦ సంగతునకు.

యాచ—(శ్రీరంగరాయని సింహాసనమునఁ గూర్చుండఁ జేసి కిరీటాలంకృతుని జేయుచున్నాఁడు.)

విన— గీ. ప్రజల బిడ్డలఁబోలెఁ గా ♦ పాడుకొనుచు
శౌర్యసాహసశక్తిప్ర ♦ శస్తిఁదనరి
సకలశత్రుల నోర్చి ని ♦ ష్కంటకముగ
ధరణిఁ బాలింపు మాచంద్ర ♦ తారకముగ.

యజ్ఞ—తథాస్తు.

యాచ—సార్వభౌమకుమారా!

చ. అరుల నెఱింగి వారియెడ ♦ నంతరభేద మెఱింగి నిత్యముం
గరకరవాల మేమరక ♦ కావుము నీప్రజ ధైర్యలక్ష్మినీ
కరము గ్రహింప శత్రుమద ♦ ఖండనలాలసదివ్యమూర్తివై
వరలుజయేందిరం విపుల ♦ వక్షము దారిచి యాదరింపుమీ.

యజ్ఞ—తథాస్తు.

తిమ్మ—కుమారా! గీ. అల కుమారునియంశ ని ♦ న్నందుఁ గాత
విబుధు లేవేళ నిన్ను దీ ♦ వింత్రుగాత
పుత్త్రపౌత్త్రాభివృద్ధితో ♦ భూతలంబు
లీలఁ జిరకాల మీవు పా ♦ లింతుగాత.

విన —
యజ్ఞ— } తథాస్తు.

యాచ—మిత్రమా! మనయభీష్టములు నెఱవేఱినవి.

విన—(సంతోషముతో) యాచశూరేంద్రా! నీవు సంకల్పసిద్ధుఁడ
వు. నీబాహువిక్రమమే కదా మమ్ముల నీయానందాబ్ధి నోలా
డించుచున్నది.

"సీ. ఉత్తరమల్లూరి ♦ యొద్ద దావలుపాప
విభునిఁ గొట్టిననాఁటి ♦ విజయకలన
తిరుమలఁ జేరి ధా ♦ త్రిని మన్నెరాజులఁ
బారఁదోలిననాఁటి ♦ బాహుబలము
చెంగలిపట్టు వీ ♦ క్షించి లగ్గలు పట్టి
యాక్రమించిననాఁటి ♦ విక్రమంబు
పాళెంబుకోటవె ♦ ల్పట నాజి యతిరాజు
జరగఁ జేసిననాఁటి ♦ శౌర్యపటిమ
గీ. మొన్న తోపూర జగ్గరా ♦ ణ్ముఖుల నొంచి



మధుర దొరఁ జెంజిమన్నీని ♦ మద మడంచి
తిరుచెనాపలి దొరఁ దోలు ♦ తేజము గల
మేటి వెలుగోటి యాచ నీ ♦ సాటి గలరె."

చ. బలియుర శత్రులం గెలిచి ♦ పార్థివవంశము నిల్పి భూమి నే
తలను గుమారరంగనికి ♦ దానులుగా నొనరించి భూప్రజల్
చెలఁగి నుతింపఁ జంద్రగిరి ♦ సింగపుగద్దియఁ బట్టభద్రుగా
నిలిపితి యాచశూరపతి ♦ నిం బొగడంగఁ దరంబె సత్కృతీ.

యాచ—సర్వంబును మీయనుగ్రహంబున సుముఖత్వ మందెను.

తిమ్మ—మన మీబద్ధుఁడైనకుమారచిక్కని నేమి చేయవలసియుండును?

విన—అది మహారాజమౌళి యగుశ్రీరంగరాయకుమారునియనుగ్రహ
ములో నున్నది.

శ్రీరం—(యాచశూరేంద్రునివంకఁ జూచుచున్నాఁడు.)

యాచ—కుమారసార్వభౌమా! ఇది మహోత్సవసమయము గదా!
ప్రబలశత్రువ్యాఘ్రములు నశించి పోయినవి. పులివేసమును
దాల్చినయీనక్క యెవ్వరి నేమిసేయనోపును. నీకు దాసుఁ
డై నాఁడు కావున విడిచి పుచ్చుటొప్పును.

కుమారచి—(కట్లువిడిపించుకొని)

సీ. అరయమిఁ బ్రత్యవా ♦ యము సంభవించెడి
నిత్యాగ్నిహోత్రిన ♦ న్నియతి మాని
శ్రుతిముఖాంగప్రకా ♦ శితశాస్త్రపద్ధత్య
లంకారసృష్టిక ♦ ళలను పీడి
బహుధాన్యహేమసం ♦ పాదిజీవన మాను
వర్ణయోగంబును ♦ వరదఁ గలిపి
విశ్వవిహితమైన ♦ విశ్రుతబ్రాహ్మణ

త్వమహత్వతత్వ మిం ♦ తయును గనక

గీ. ప్రథితపంచాంగజీవనో ♦ పాయవంశ
జాతు నను దల్లి ద్రవ్యాశ ♦ చేత నకట!
ప్రభు వగుదునని యీగతి ♦ పాలుపఱుప
వసుధ రెంటికిఁ జెడినరే ♦ వణిన యైతి.

అయినను నిట్టియల్లకల్లోలములో నున్నయీరాజ్య మెవ్వరికి సుఖము? దైవము న న్నెందులకుఁ బుట్టించెనో నే నందులకే జీవించెదను. ఇతఁడు నా కేఁక శత్రుఁడు కాఁడు. ఈరాజకుమారునకు శుభ మగుఁ గాక! నాతలపై బరువు తీఱినది.

(అని నిష్క్రమించును.)

శ్రీరం—యాచశూరేంద్రా!

గీ. మమ్ముఁ గాపాడుకొంటి నే ♦ మమ్ముతోడ
రాజ్యభారమ్ము మా కిచ్చి ♦ పూజ్యమతిని
బుజము సవరించుకొనఁ జూడఁ ♦ బోల దింక
నీ వనఁగ నేమనఁగ భేద ♦ నియతి గలదె?

యజ్ఞ—
విన— } కుమారా! అన్యోన్యము నట్లే వర్ధిల్లుదురుగాక!

(తెరలో)

శా. నేమంబయ్యెను బారసంతతులకున్ ♦ శ్రీయాచశూరోర్విభృ
ద్ధీమాహాత్మ్యము రామరక్షగను ను ♦ ద్దీపించి సామ్రాజ్యల
క్ష్మీమాన్యుండయి సింహపీఠమున నీ ♦ శ్రీరంగరాజేంద్రుఁ డు
ద్దామప్రక్రియ నేఁడు దీనజనసం ♦ త్రాణార్థమై నిల్చుటన్.

విన
యజ్ఞ } సంతోషము. సంతోషము! యాచశూరేంద్రా! శ్రీరంగరాజకుమారుని సార్వభౌమునిం జేసితివి. ప్రజలును మహానందపారావారంబున నోలాడుచున్నారు.

శా. ఆనందంబున నాసుధాకిరణతా ♦ రార్కంబు భూపాలురై
నీనామాక్షరముల్ శుభాంకములుగా ♦ నీవార లాత్మాభిధా
నానూనాక్షరపాళిఁ జేర్చికొని శా ♦ ర్యౌదార్యధన్యాత్ములై
దానప్రౌఢి వెలంగుచుండెదరు గా ♦ తన్ యాచశూరాధిపా!

ఇంకను నీ కేమి కావలయును?

యాచ—మహాత్ములారా! భవదనుగ్రహవిశేషంబున సకలార్థంబులు సిద్ధించినవి. అయిన నిట్లగుఁ గాక!

గీ. ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁ గాక
ప్రభువు లన్యోన్యవైరభా ♦ వములు వీడి
ప్రజల బిడ్డలఁబోలెఁ గా ♦ పాడుకొనుచు
స్థిరయశోవిభవములఁ గాం ♦ చెదరు గాక!

యజ్ఞ—
విన— } తథాస్తు.

(అందఱునిష్క్రమింతురు)

---

గద్యపద్యము.

శ్రీరామచంద్రపా ♦ దారవిందోరుమ
రందపానోజ్జ్వలేం ♦ దిందిరుండు
బాలాంత్రికులచైత్ర ♦ వనపారిజాతుండు
వాధూలసద్గోత్ర ♦ పావనుండు
సూరమాంబాగర్భ ♦ శుక్తిముక్తామణి
నారసింహామాత్య ♦ నందనుండు

అమలధనాభిరా ♦ మాదినాటకకర్త
బంధురచిత్రప్ర ♦ బంధవక్త
లైనవేంకటరాయాభి ♦ ధానసుకవి
చంద్రికృత మిదియాచశూ ♦ రేంద్రవిజయ
మనెడిశ్రీరంగరాయప ♦ ట్టాభిషేక
నామరససమంచితనవ్య ♦ నాటకంబు.

సప్తమాంకముతో
సర్వమును
సంపూర్ణము.



